R.No:APTEL/2006-20000

# చైతన్య మానవి

CHAITANYAMANAVI

సంపుటి : 12 సంచిక : 2 హైదరాబాద్, ఫిబ్రవరి 2017 52 పేజీలు రూ.10/-







## ఐద్వా అఖిలభారత మహాసభల స్ఫూర్తితో....





ప్రసంగిస్తున్న వేముల రాధిక


మహాసభ జెండా ఆవిష్కరణ


ప్రతినిధుల సభలో ఆరేటి సత్యవతి, దేవాశ్రీ సేనాపతి, సంతోషి



అధ్యక్షురాలు మాలినీ భట్టాచార్య



ఐద్వా క్యాలెండర్ ఆవిష్కరణ


ఎ.పి ప్రతినిధుల చర్చలు


ఎన్నికైన కేంద్ర కమిటీ సభ్యులు వి.సావిత్రి, ఆర్.ఎన్.మాధవి, బి.ప్రభావతి, డి.రమాదేవి - ఆంధ్రప్రదేశ్

సంపాదకీయం

చైతన్య మానవి

# స్త్రీ విముక్తి పోరాటాలకు మార్గదర్శి ఐద్వా

భోపాల్‌లో జరిగిన ఐద్వా అఖిలభారత మహాసభలు భారతదేశ సామాజిక సంఘర్షణకు, సమాలోచనలకు వేదికగా నిలిచాయి. మనువాదమే పాలక సిద్ధాంతంగా సాగుతున్న కాలం ఇది. ఫలితంగా ప్రజాస్వామిక గళాలను కత్తిరిస్తున్న కాలం.

రోహిత్ ఆత్మత్యాగం దేశవ్యాప్తంగా విద్యార్థులను కదిలించింది. ఆకాశాన్ని ముద్దాడాలని కలగన్న బిడ్డ కులోన్మాదుల, మతోన్మాదుల కుట్రకు బలయ్యాడు. ఇందుకు కారకులైన మహానటి స్మృతి ఇరానీ, బండారు దత్తాత్రేయ, వి.సి. అప్పారావులపై ప్రభుత్వం ఈగ వాలనివ్వటం లేదు. దళిత, గిరిజన అత్యాచార నిరోధ చట్టాన్ని అమలు చేయకుండా ఉండేందుకు రూపన్‌వాలా కమీషన్ వేసింది. కుల వివాదాన్ని కొనసాగిస్తూనే వుంది.

బిడ్డ చచ్చిపోయిన నాడు ఆ తండ్రికి పట్టలేదు. సంవత్సరం తర్వాత పోలీసు రాచమర్యాదలతో హెచ్‌సియు ప్రాంగణంలోకి వచ్చాడు. కనిపెంచిన తల్లిని అరెస్ట్‌చేసి పోలీస్ స్టేషన్‌కు తరలించారు. ఎస్.సి, ఎస్.టి. కేసులలో సవరించిన చట్టం మేరకు 60రోజులలో ఛార్జీ షీటు వెయ్యాలి.

ఆలస్యానికి కారణమేమిటో వ్రాతపూర్వకంగా తెలియజేయాలి. బాధిత కుటుంబానికి నష్టపరిహారం ఇవ్వాలి. కానీ ఇవేమీ జరగకపోగా న్యాయం జరగాలని కోరుకుంటున్న తల్లిని విచారణ పేరిట వేధిస్తున్నారు. సుప్రీం కోర్టు తీర్పు మాత్రమే కాక సహజ న్యాయం కూడా అయిన తల్లి హక్కును కాలరాస్తున్నారు.

దబోల్కర్, పన్సారే, కల్బుర్గి లాంటి మేధావులతోపాటు గోరక్షణ పేరుతో అమాయకులైన ముస్లింమైనారిటీలు, దళితులను హత్యలు చేస్తున్నారు. నజీబ్ అహ్మద్ అదృశ్యం మేధో కేంద్రాలపై సాగుతున్న దాడికి మరో నిదర్శనం.నోట్ల రద్దుతో 120కోట్ల ప్రజల జేబులకు చిల్లులు పెట్టారు. అభివృద్ధి పేరిట సంపన్నుల కొమ్ముగాస్తున్నారు. ఉపాధి లేమి హీనమైన వేతనాలతో తమ శ్రమ శక్తిని మహిళలు కారుచౌకగా ధారపోస్తున్నారు. నగదు రహిత లావాదేవీలను బలవంతంగా రుద్దుతున్నారు. ఏక వ్యక్తి నిర్ణయాలతో అప్రకటిత ఎమర్జెన్సీ నడుస్తున్నది.

మనువాదం మేధో వికాసాన్ని, ప్రజాస్వామ్యాన్ని సహించలేకపోతుంది. మైనారిటీలు, దళితులు, మేధావులు మాత్రమే కాదు మహిళలపైన సైతం అణచివేత విస్తరిస్తున్నది. బెంగుళూరు ఘటనలు సైతం ఆధిపత్యవాదాన్ని తలకెక్కించుకున్న ముష్కరమూకల చర్యలే. ఈశాన్య రాష్ట్రాల నుండి ఆడపిల్లలను తల్లిదండ్రులకు దూరంగా పంజాబ్, గుజరాత్ రాష్ట్రాలకు తరలించి ఫాసిస్టు భావజాలాన్ని తలకెక్కించే ప్రయత్నాలను వెలుగులోకి తెచ్చిన అవుట్‌లుక్ పత్రికపై దాడులు జరిగాయి. ఛత్తీస్‌ఘడ్‌లో 16మంది ఆదివాసీ మహిళలపై రక్షణ బలగాలు అత్యాచారం చేశాయి. వీరికి అండగా నిలుస్తున్న అర్చనా ప్రసాద్ లాంటి వారిపై తప్పుడు కేసులు పెట్టటమేగాక అలాంటి వారిని ఆ రాష్ట్రానికి రాకుండా ప్రభుత్వాలు అడ్డుకుంటున్నాయి.

అధికారంలో ఉన్న పాలకులు హంతక ముఠాలకు అండగా నిలబడుతున్నాయి. అప్రజాస్వామిక, అణచివేత శక్తులకు ఊతమిస్తున్నాయి. ప్రజాస్వామిక సంస్థలను నీరుగారుస్తున్నాయి. కంచేచేనును మేస్తున్న మాదిరి నేరస్తులే పాలకులైన వేళ ఇది. రానా ఆయూబ్ వెలికి తెచ్చిన గుజరాత్ ఫైల్స్ మారణహోమాన్ని జరిపిన నేతల పాలనను మనకళ్ళముందుంచింది. గాంధీని చంపిన గాడ్సే పంథాలో ఎ.బి.వి.పి. లాంటి వెయ్యిన్నొక్క సంస్థలలో యువకులకు ఫాసిస్టు శిక్షణసాగుతుంది.

అయితే అణచివేతను, హత్యాకాండను ప్రతిఘటిస్తూ దేశం నలుమూలల నుండి ధిక్కార స్వరాలు ప్రశ్నిస్తున్నాయి. సంకెళ్ళు బద్దలు కొట్టాలని పిలుస్తున్నాయి. బిడ్డల పెంపకంలోనే కాదు వారిని రక్షించుకోవటం అవసరమని గుర్తిస్తున్న తల్లులు వీధుల్లోకి వస్తున్నారు. అవార్డులను తిరస్కరించడమే కాదు హంతక, అప్రజాస్వామిక శక్తులతో వేదికలను పంచుకోవడానికి తిరస్కరిస్తున్నారు. ఆడమనిషి చుట్టూ అపవిత్రత, అసమానతకు మేలిముసుగని ధిక్కరిస్తున్నారు.

శ్రామిక శక్తిలో మూడవ వంతు ఉన్న మహిళల సమాన హక్కులకోసం సాగే ఉద్యమాల సంఘటిత రూపంగా ఐద్వా మహాసభలు జరిగాయి. ముక్తాదబోల్కర్, వేముల రాధిక, పినరయ్ విజయన్, రాజీవ్ జోషిలు పాల్గొన్న ఈ సభలు ధిక్కార స్వరాలకు వేదికయ్యాయి. కష్టతరమైనా పోరాటం మినహా మరోమార్గం లేదని ఐద్వా జాతీయ మహాసభలు పిలుపునిచ్చాయి. ప్రజాస్వామ్యాన్ని బలపర్చుకుంటూ సమానత్వం కోసం సాగే పోరాటాలను మహాసభల నిర్ణయాలు మార్గ నిర్దేశం చేశాయి.

# చైతన్య మానవి



ఐద్వా ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
1-1-9/10 జవహర్ నగర్,
హైదరాబాద్-20
ఫోన్, 9490098620
E-mail : Chaitanyamanavi@gmail.com



వెల రూ : 10/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,
బ్లాక్ నెం: 21/1 ఎంహెచ్ భవన్,
అజామాబాద్ ఇండస్ట్రియల్ ఏరియా,
హైదరాబాద్ -20

## ఈ సంచికలో



పత్రికలో విభిన్న అంశాలపై వస్తున్న వ్యాసాలు రచయితల అభిప్రాయాలు మాత్రమే. అందులో పేర్కొన్న అన్ని అంశాలతో మానవి సంపాదక వర్గం ఏకీభవిస్తుందని భావించవలదు.

\- ఎడిటర్

PRINTED AND PUBLISEHD BY D. RAMA DEVI, AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM, PRINTED AT PRAJASAKTI DAILY PRINTING PRESS, M.H. BHAVAN, PLOT NO. 21/1, AZAMABAD INDUSTRIAL AREA, HYDERABAD-500020, TELANGANA STATE. PUBLISHED AT AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM AIDWA STATE OFFICE 1-1-9/10, JAWAHAR NAGAR. HYDERABAD-500020, TELANGANA STATE. EDITOR: D. RAMA DEVI. R.NO. APTEL/2006-20000

వ్యాసం

# సరళీకరణ విధానాలను తిప్పికొట్టడమే సమానత్వ సాధనకు మార్గం

- బృందాకరత్

ప్రియమైన సోదరీమణులారా!

మిత్రులారా !

ఐద్వా 11వ అఖిల భారత మహాసభల సందర్భంగా అభినందనలు తెలియజేస్తున్నాం. చాలా క్లిష్టమైన పరిస్థితుల్లో ఉద్యమాన్ని, ఐద్వా లక్ష్యాలను ముందుకు తీసుకెళ్లేందుకు ఎనలేని కృషి చేసిన మీ అందరికీ శుభాకాంక్షలు. ఉద్యమం తొట్టతొలి ఆరంభకులకు ఘననివాళులు అర్పిస్తున్నాను.

బెంగాల్‌లో ఊహకందని, కష్టమైన పరిస్థితుల్లో దీక్షాబద్ధులై ప్రజాస్వామ్య జెండాను పరిరక్షిస్తున్న వారందరికీ హృదయపూర్వక అభినందనలు.

లక్షలాది కార్యకర్తల అవిరామ కృషి, మన సంఘం నిర్వహించిన పాత్ర, కేరళలో, త్రిపురలో వామపక్ష ప్రజాతంత్ర ప్రభుత్వాలు ఏర్పడేందుకు దోహద పడ్డాయి. త్రిపురలోని అత్యధిక మహిళా జనాభా మన 'ఐద్వా' సభ్యులుగా ఉన్నారు.

అవినీతి, ముఖ్యంగా వ్యాపం వంటి కుంభకోణాల్లో మునిగిపోయి కార్పొరేట్ అనుకూల విధానాలు అమలుచేస్తూ గిరిజన, రైతు వ్యతిరేక విధానాలు అమలు చేస్తున్న మధ్యప్రదేశ్ రాష్ట్రంలో, ప్రజాతంత్ర మహిళా సంఘం ఈ మహాసభలను నిర్వహిస్తున్నందుకు అభినందనలు. ఈ కాలంలో మన సంఘం అనేక విజయాలను సాధించింది. మహిళా విముక్తి, సమానత్వం, ప్రజాస్వామ్యం మన జెండాపై నినాదాలు. మన నేటి క్లిష్ట పరిస్థితుల్లో ఈ నినాదాలకు చాలా ప్రాధాన్యత ఉంది.



**ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం:**

మన దేశ స్వాతంత్ర్యంపై అనేక సార్లు దాడులు జరిగాయి. స్వాతంత్ర్య పోరాట కాలంలో మన మహిళా ఉద్యమం ఆవిర్భవించింది. ఆ తర్వాత అత్యవసర పరిస్థితికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా జరిగిన పోరాటం వెనువెంటనే 'ఐద్వా' ఏర్పడింది. నియంతృత్వ పాలనా ధోరణులు, అణిచివేత ఇంకా మన దేశంలో వివిధ రూపాల్లో సాగుతూనే వున్నాయి. గతంలో ఏనాడూ లేనంత నిరంకుశంగా మోడీ ప్రభుత్వం వ్యవహరిస్తోంది. నయాసరళీకరణ విధానాల అమలు ఒకవైపు, విచ్ఛిన్న ధోరణితో విద్వేష హిందూత్వ ఎజెండా అమలు మరోవైపు లక్ష్యాలుగా బీజేపీ పాలన ఉంది. వీటికి దేశభక్తి ముసుగు. ఎవరైనా దీనిని వ్యతిరేకిస్తే, ప్రశ్నిస్తే వారిని జాతి విద్రోహులుగా, దేశానికి అరిష్టంగా చిత్రీకరిస్తున్నారు. అత్యంత తిరోగమన శక్తులు పెరగటానికి, బలపడటానికి ఇది దారి తీస్తుంది. బ్రాహ్మణవాదం పునర్జీవనానికి, మనువాద సంస్కృతిని ప్రోత్సహించేందుకు, మూఢ నమ్మకాలు, మూఢాచారాలు పెరగడానికి ఈ విధానాలు దోహదం చేస్తున్నాయి. ఇదేదో ప్రభుత్వ సహాయంతో ఆర్ఎస్ఎస్ చేస్తోందని అనుకుంటే పొరపాటే. ప్రభుత్వాన్ని నడిపిస్తోందే ఆరెస్సెస్.

ఈ శక్తులను ఎదిరించడం, నివారించడం, వాటిని తిప్పికొట్టడమే మన నేటి ప్రధాన కర్తవ్యం. లౌకికతత్వం, ప్రజాస్వామ్యం చెట్టాపట్టాలేసుకొని ఉంటాయి. చారిత్రకంగా మహిళా ఉద్యమాలు, ముఖ్యంగా 'ఐద్వా' వంటి నిబద్ధత గల మహిళా సంఘాలు, వామపక్ష భావజాలం ఉన్న సంఘాలు మహిళల స్వయం ప్రతిపత్తి, మహిళా స్వేచ్ఛను ప్రజాస్వామ్య ఉద్యమంలో భాగంగా భావిస్తాయి. ప్రజా స్వామ్యం అనేది సామాజిక, ఆర్థిక, అసమానతలకు, రెండో స్థాయి పౌరులుగా మహిళలను అణిచివేసే ధోరణికి వ్యతిరేకంగా పోరాటం అని మన భావన.

మహిళలపై జరుగుతున్న అఘాయిత్యాలకు వ్యతిరేకంగా చేసే పోరాటం కూడా ప్రజాస్వామ్యం కోసం చేసే పోరాటమే. ఇంటా, బయటా భద్రత, సురక్షిత మైన రక్షణ కనీస ప్రజాస్వామ్యహక్కు. అప్పుడే స్త్రీ, సమాన హక్కులు గురించి ఆలోచించగలదు. సాధించగలదు. రాజ్యాంగంలో రాసుకున్నంత మాత్రాన ఈ అత్యాచారాలను నిలవరించలేం.

స్త్రీల సమాన హక్కులకు ఆర్ఎస్ఎస్, బీజేపీ వ్యతిరేకం. మహిళలు పాతమూస పోసిన పద్ధతిలోనే ఉండాలనేది తమ లక్ష్యం అని ఆర్ఎస్ఎస్ మహిళా విభాగం రాష్ట్రీయ సేవికా సమితి ప్రకటించుకుంది. సనాతన సంప్రదాయాలు, సంస్కృతికి భిన్నంగా

**నయాసరళీకరణ విధానాల అమలు ఒకవైపు, విచ్ఛిన్న ధోరణితో విద్వేష హిందూత్వ ఎజెండా అమలు మరోవైపు లక్ష్యాలుగా బిజెపి పాలన ఉంది. వీటికి నకిలీదేశభక్తి ముసుగు. ఎవరైనా దీనిని వ్యతిరేకిస్తే, ప్రశ్నిస్తే వారిని జాతి విద్రోహులుగా, దేశానికి అరిష్టంగా చిత్రీకరిస్తున్నారు. అత్యంత తిరోగమన శక్తులు పెరగటానికి, బలపడటానికి ఇది దారి తీస్తుంది. బ్రాహ్మణత్వం పునర్జీవనానికి, మనువాద సంస్కృతిని ప్రోత్సహించేందుకు, మూఢనమ్మకాలు, మూఢాచారాలు పెరగడానికి ఈ విధానాలు దోహదం చేస్తున్నాయి. ఇదేదో ఆర్ఎస్ఎస్ ప్రభుత్వ సహాయంతో చేస్తోందని అనుకుంటే పొరపాటే. అసలు ప్రభుత్వాన్నే ఆర్ఎస్ఎస్ నడిపిస్తోంది.**

మహిళలు ఇల్లు వదిలి పనిచేయడాన్ని వ్యతిరేకిస్తుంది. అయితే అనేకానేక కుటుంబాలు మహిళల ఆదాయంపైనే ఆధారపడి ఉన్నాయనేది వారు పట్టించుకోరు. అత్యాచారం జరిగితే, బాధితురాలిపై ప్రశ్నలు గుప్పించి బాధపెట్టడం వారి నైజం. బాధితురాలిపైనే నెపం నెట్టే దుర్మార్గం చేస్తుంటారు. ఏం రాత్రి బయట ఎందుకు ఉండాలి అని సందేహం వ్యక్తం చేస్తారు. 'జీన్సు ప్యాంటు వేసుకొని ఎందుకు తిరగాలి'? అని ఎదురు ప్రశ్నలు వేస్తుంటాయి హిందూత్వ మూకలు. ఇదేదో బీజేపీ, ఆర్.ఎస్.ఎస్ కే పరిమితం కాదు. ఇతర బూర్జువా పార్టీల్లో కూడా ఈ జబ్బు ముదురుతోంది. సామాజిక రక్షక దళం పేరుతో దాడులు చేస్తుండటమే ఈ హిందూత్వ మూకల చరిత్ర.

పెద్ద పెద్ద ఉమ్మడి, ఉన్నత కుటుంబాలను తయారుచేయాలంటే స్త్రీలు దీనిని భరించాల్సిందేనని అంటారు. గృహహింస, కట్నంచావులు, బాలికలపై లైంగికదాడులు ఇవన్నీ తప్పవు అనేది ఆర్ఎస్ఎస్ సిద్ధాంతం. అంతేకాకుండా పురాణాల్లోని మహిళా పాత్రలను, పతివ్రతల కథలను చెప్పి ఆ పేరుతో సంస్కారం, సంస్కృతిని కాపాడాలని ఆర్ఎస్ఎస్ చెబుతోంది. కుల విద్వేషంతో కూడిన అగ్రవర్ణాల సంస్కృతి, మహిళలను అణిచివేసే సంస్కారాన్ని పరిరక్షించాలనేది వారి కోరిక.

ఇటువంటి ధోరణులతో మన ఉద్యమం నేరుగా పోరాడుతోంది. ప్రమాదకరమైన అంశం 'మహిళలపై హింస', దానిని నిరోధించేందుకు అన్ని చర్యలు తీసుకోవాలి. అయితే దీనిని వర్ణ విభేదంగా చూస్తుంది ఆర్ఎస్ఎస్. అత్యాచారంకు గురైన బాధితురాలు ఏ కులం, ఏ కులం వాడు అత్యాచారం చేశాడు అనే కోణం లోంచి దీనిని నీరుకార్చే ప్రయత్నం చేస్తు న్నాయి హిందూత్వ శక్తులు. హిందూ మహిళలు చాలా అపాయం ఎదుర్కొంటు న్నారని ప్రత్యేకంగా మరొక మతంపై ద్వేషం రగిల్చే కుట్రలు చేస్తోంది. ఈ రెచ్చగొట్టే ధోరణి తీవ్రమైన మతకల్లోలానికి, హింసకు దారి తీస్తోంది. యూపీలోని ముజఫర్‌పూర్ తదితర ప్రాంతాల్లో ఇదే జరిగింది. అనేక అసత్యాలు ప్రచారం చేయడాన్ని వ్యతిరేకిస్తున్నాం. అత్యాచారంతో సహా, అన్ని రకాల హింసపై పోరాడతాం. ముఖ్యంగా చాలా బాధాకరమైన, కలిచి వేస్తున్న విషయం చిన్న పిల్లలపై లైంగిక దాడులు. ఎవరో దుర్మార్గులు, అగ్రవర్ణ బాలికపై దాడిచేసిన కారణంగా, ప్రతీ కారంగా దళితవర్గాలపై పైశాచిక దాడి చేశారు. ఆర్ఎస్ఎస్, హిందూత్వమూకలు వాస్తవంగా దుర్మార్గులపై పెరగాల్సిన ఆగ్రహాన్ని దళితులపై కేంద్రీకరించారు. మహిళలపై అత్యాచారం జరిగిన ప్రతిసారీ, బాధితుల కోపాగ్నిని మళ్లించేందుకు వారు ఇదే కుట్రను చేస్తున్నారని గమనించాలి. దీనిని తిప్పికొట్టాలి.

రోహిత్ వేముల ఆత్మహత్య సంస్థాగత హత్య. మోడీ ప్రభుత్వం తీవ్రమైన కుల విద్వేషాలతో జరిగిన సంఘటన. పుండు మీద కారం జల్లినట్లుగా ప్రభుత్వ యంత్రాంగం నిస్సిగ్గుగా ఈ కేసుని తప్పుదారి పట్టించేందుకు, ఆరోపణలు ఎదుర్కొంటున్న కేంద్ర మంత్రులను రక్షించేందుకు ప్రయత్నిస్తోంది. రోహిత్ దళితుడు కాదని రుజువు చేయడానికి పనిచేస్తోంది. దీనిని అన్ని విధాలా ఖండిస్తున్నాం. నిందితులపై వెంటనే కఠిన చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేస్తున్నాం.

కుల వ్యవస్థలో విశ్వాసం ఉన్న హిందూత్వ శక్తులు గౌరవ హత్యలు చేయిస్తున్నాయి. ఖాప్ పంచాయితీలు దీనికి నిదర్శనం. ఒక హిందూ యువకుడు, ముస్లిం యువతిని ప్రేమించి పెళ్లి చేసుకున్న స్థితిలో మత విద్వేషాలు రెచ్చగొట్టేందుకు వారు ఇచ్చిన నినాదం 'లవ్ జిహాద్'. విద్వేషపూరితమైన లక్ష్యం.

ఎవరు ఏ తినాలో, ఏ బట్టలు వేసుకోవాలో, ఆదేశాలు ఇస్తున్నారు. గొడ్డు మాంసం తినకూడదంటారు. పౌరులకు రాజ్యాంగం కల్పించిన పౌర, మానవ, ప్రజాస్వామిక హక్కులపై దాడి చేస్తున్నారు. ఈ ప్రభుత్వ కాలంలో మైనార్టీలపై దాడులు పెరిగాయి. గో రక్షకుల పేరుతో హత్యలు చేస్తున్నారు. ఉత్తర ప్రదేశ్‌లో అఖ్లాక్ హత్య దీనికి ప్రత్యక్ష నిదర్శనం. అలాగే అదే గో రక్షణ పేరుతో దళితులపై దాడి చేస్తున్నారు.

దీనికి గుజరాత్‌లోని ఉనా సంఘటన నిదర్శనం. దీనిపై తీవ్రమైన నిరసన పెల్లుబికింది. ప్రధాన మంత్రి నోరు విప్పాల్సి వచ్చింది. ఆర్ఎస్ఎస్‌ది చాతుర్వర్ణ వ్యవస్థపై మూఢవిశ్వాసం. దాని ఆధారంగానే వృత్తులు ఆధిపత్యం ఉండాలని కోరుకుంటోంది. ఇదే సామాజిక హింసకు ప్రధాన కారణం. దీనికి నిరసనగా "మీ పశువులు చర్మాన్ని మీరే వీక్కోండి'' అని దళితుల పిలుపు, తిరుగుబాటు ఆర్ఎస్ఎస్, బీజేపీలకు చెంపదెబ్బ.

ఈ విధానాలన్నీ దళితులు, ముస్లిం లతో పాటు మహిళలపై కూడా తీవ్రమైన ప్రభావం చూపుతున్నాయి. మతోన్మాద, కుల విద్వేషాలపై రాజీలేని పోరాటం జరపాల్సిందే. కుల వ్యవస్థకు వ్యతిరేకంగా ఉద్యమించవలసిందే.

హిందూత్వ శక్తులపై చేసే ఐక్య పోరాటానికి మహిళా సంఘాలు, దళిత సంఘాలతో మనకు బలమైన సంబంధాలు ఉండాలి. అన్ని రకాల మౌఢ్యానికి మనం వ్యతిరేకం. మహిళలను కించపరిచే మత ఉద్వేగాలకు మనం వ్యతిరేకం. ఈ మధ్యనే 'తలాక్' గురించి ఏకపక్ష నిర్ణయాలపై ముస్లిం మహిళలు గొంతెత్తి నినదిస్తున్నారు. ఈ 'తలాక్' పద్ధతి ఇతర ముస్లీం దేశాలలో అమలులో లేదు. పాకిస్తాన్, ఇండోనేషియా, సౌది అరేబియా వంటి పెద్ద ముస్లీం దేశాల్లో లేదు. ఈ తలాక్ తప్పుడు పద్ధతి. కొద్ది మంది మత శక్తులు మహిళలను అణిచివేసే అనాచారాన్ని పట్టుకు వెళ్లాడుతున్నారు. అందుకే ఈ తలాక్ విధానాన్ని రద్దు చేయాలన్న వారికి మద్దతుగా నిలబడుతున్నాం.

ఈ సందర్భంలో మోడీ ప్రభుత్వం హిందూత్వ ఎజెండా ఉమ్మడి సివిల్ కోడ్‌ను హిందూత్వ ప్రచారానికి ఉపయోగించుకుంటోంది. ఉమ్మడి కోడ్ తోనే సమానత్వం గ్యారంటీ కాదు. దీర్ఘ కాలంగా మన వైఖరి ఏమిటంటే విశాల ప్రాతిపదికన అందరికీ హక్కులు అనేది ఈ పరిస్థితుల్లో అవసరమని, తప్పకుండా పర్సనల్ లాస్‌ను సవరించాలని, అదే సందర్భంలో హిందూత్వ చట్టాల మహిళా వ్యతిరేక అంశాలన్నింటినీ రద్దుచేయాలని కోరుతున్నాం.

మహిళల రిజర్వేషన్‌లను నీరగార్చుతున్నారు. పంచాయితీలు, స్థానిక సంస్థల్లో ఉన్నట్లుగానే అన్ని చట్టసభల్లోనూ 50% రిజర్వేషన్స్ ఉండాలనే డిమాండు పెరుగు తోంది. 50% డిమాండ్ తర్వాత సంగతి. బీజేపీ పాలిత రాజస్థాన్, హర్యానాల్లో ఎన్నికల్లో పోటీచేయడానికే సిగ్గు చేటయిన షరతులు విధిస్తున్నారు.

అక్షరాస్యత, కనీస విద్యార్హత ఎన్నికల్లో పోటీ చేయడానికి కావాలం టున్నారు. పేదలను ఎన్నికల్లో పోటీకి అనర్హులు చేయడమే దీని ఉద్దేశం. పేద కుటుంబాలు పేదరికం వలన బాలికలను చదివించడంలేదు. దాంతో మహిళల్లో విద్య పెరగటం లేదు. కాబట్టి పేద మహిళలు (కనీస విద్యార్హత లేనివారు) పోటీ చేయకుండా అడ్డుకుంటున్నారు. మహిళలపై జరుగుతున్న ఈ అప్రజాస్వామిక దాడిపై పోరాడుతున్నాం. పక్షపాత వైఖరితో ఉన్న న్యాయవ్యవస్థపై కూడా పోరాడు తున్నాం. చట్టసభల్లో 33% రిజర్వేషన్ పోరాటం మన దేశంలో ప్రజాస్వామ్యం విస్తరించడానికి, బలపడటానికి ముఖ్యమైన అంశంగా భావిస్తున్నాం.



పశ్చిమబెంగాల్ రాష్ట్రంలో వామపక్ష ఉద్యమంపై, ఆ ప్రజాసంఘాలపై కనివినీ ఎరుగని దాడి జరుగుతోంది. ఇదంతా ఒక మహిళా ముఖ్యమంత్రి కనుసన్నల్లో జరుగుతోంది. ఆ రాష్ట్రంలో ప్రజా స్వామ్యంపై దాడిని తిప్పికొట్టేందుకు, దాడులను ఎదుర్కొనేందుకు 'ఐద్వా' ధీరోధాత్త పోరాటం చేస్తోంది. ఇది ఒక్క బెంగాల్ రాష్ట్రానికే సంబంధించిన అంశం కాదు. యావత్తు దేశానికి సంబంధించినది. బెంగాల్ పోరాటానికి, ఉద్యమానికి సంఘీ భావం తెలియజేద్దాం. వారి పోరాటంలో భుజం భుజం కలిపి సాగుదాం.

**సమానత్వం:-**

ఆర్ఎస్ఎస్, బీజేపీ మతతత్వ విధానాలపై మన పోరాటం, ప్రజాస్వామ్యం గురించి, లౌకికత్వం గురించి మన పోరాటం, సమానత్వం గురించి మనం చేస్తున్న పోరాటంలో లోతుగా ముడిపడివున్నాం. మతశక్తులు ప్రజలను చీల్చాలని, మతం పేరుతో మహిళలను విభజించాలని, ఆ విధంగా ఐక్య పోరాటాల్ని నీరుగార్చాలని ప్రయత్నం చేస్తున్నారు. నిరుద్యోగం, అధిక ధరలు, ఆహార అభద్రత, క్షీణించిపోతున్న ఆరోగ్య వైద్య, విద్య సౌకర్యాలు ఇవన్నీ సరళీకరణ విధానాల ప్రభావం. మొత్తం ప్రభుత్వరంగాన్ని ప్రైవేటుపరం చేసే కుట్ర ఇందులో భాగమే.

ఇవన్నీ అందరూ ఎదుర్కొంటున్న సమస్యలు. ఈ ఉమ్మడి సమస్యల పట్ల ప్రతిస్పందించకుండా ప్రజలను మతం పేరుతో, కులం పేరుతో చీల్చుతున్నారు. రోజువారీ పోరాటాల ద్వారా మాత్రమే మతతత్వ శక్తులను, తిరోగమన శక్తులను ఒంటరి చేయగలం. లౌకికత్వం కోసం, ఐక్యతకై మనం చేసే పోరాటంలో తప్పకుండా మతతత్వశక్తులను, నేటి పరిస్థితుల్లో కచ్చితంగా తిప్పికొట్ట గలం. ఉపాధి, సామాజిక భద్రత సాధించడంలో కూడా జయప్రదం అవు తాం. ప్రజలను చీల్చే మతతత్వ శక్తులను నిరోధించగలం. ఇది మన అనుభవం. గ్రామీణ శ్రామిక మహిళల వద్దకు మన ఉద్యమం చేరాలి. అసంఘటిత రంగ మహిళల వద్దకు కూడా వెళ్లాలి. వివిధ వృత్తుల్లో ఉన్న మహిళలకు చేరువకావాలి. ఇవన్నీ విశాలమైన మహిళా ఉద్యమాల వేదిక ద్వారానే సాధించగలం. అధిక ధరలపై, ఆహారభద్రతపై విరామంలేని పోరాటం చేస్తున్న 'ఐద్వా'కు నా హృదయ పూర్వక అభినందనలు.

మహిళలు, పురుషుల మధ్య, సామాజిక తరగతులు, వర్గాల మధ్య తీవ్రమైన అంతరాలు పెరుగుతున్నాయి. కరువు కాటకాలతో తల్లడిల్లిపోతున్న గ్రామీణ ప్రజల ఆవేదన పాలకులకు పట్టడంలేదు. ప్రభుత్వ విధానాలు, పేదరైతులు, గ్రామీణ పేదలపట్ల అమానవీయమైన నిర్లక్ష్య వైఖరి వహిస్తున్నాయి.

నేడు సామ్రాజ్యవాదం, ప్రపంచీకరణ విధానాల ప్రభావంతో, అక్స్‌ఫామ్ నివేదిక ప్రకారం 85 మంది ధనవంతులు, ప్రపంచంలోని సగం జనాభా సంపదను కలిగివున్నారు. చాలా నామమాత్రమైన సంఖ్యగా ఉన్న ధనికులను ఒక్క డబుల్ డెక్కర్ బస్సులో కూరేయచ్చు. అంత చిన్న సంఖ్య వారిది అని ఆక్స్‌ఫాం డైరెక్టర్ ఉటంకించారు.

ఈ విధానాలనుసరిస్తున్న ఇండియాలో (క్రెడిట్ న్యూస్ నివేదిక అంచనా ప్రకారం దేశం జనాభాలో) ఒక శాతంగా (1.1%) గా వున్న శతకోటీశ్వర్లు 53% సంపద కలిగివున్నారు. 90% ప్రజలు దేశ సంపదలో 25% మాత్రమే కలిగివున్నారు. ప్రపంచంలో శతకోటీశ్వరుల సంఖ్య పెరిగిన దేశం ఇండియా.

25 ఏళ్ల సరళీకరణ విధానాలు అంతరాలను పెంచేశాయి. గిరిజన మహిళలు తీవ్రంగా పేదరికంలోకి నెట్టబడ్డారు. కార్మికవర్గంపై దోపిడీ తీవ్రత పెరిగింది. గణాంకాలు పరిశీలిస్తే కళ్లు చెదిరిపోతాయి. ఈ 25 ఏళ్లలో వేతనాల వాటా 12శాతానికి పడిపోయింది. అదే సందర్భంలో లాభాల వాటా 20% నుండి 50శాతానికి పెరిగింది. శ్రామికులు అంతకంతకూ కాంట్రాక్టు కార్మికులుగా, క్యాజువల్ కార్మికులుగా, దినసరి కూలీలుగా మార్పు చెందుతున్నారు. చాలా నిరాశ నిస్పృహలతో ఉపాధికి వెతుకులాట ఎక్కువైంది.

చాలా హీనమైన కూలికే ఏ పనినైనా చేసేందుకు మహిళలు సిద్ధపడుతున్నారు. ఉపాధిహామీ పథకంతో కొద్దిగా ఊరట కలుగుతోంది అనుకుంటే దాన్ని కూడా నిర్వీర్యం చేసి నోటికాడ కూడును లాగేస్తున్నారు. 50 లక్షలకుపైగా ఉన్న అన్ని రకాల స్కీంవర్కర్లు కనీసవేతనానికి సైతం నోచుకోవడం లేదు.

ఇదంతా మహిళలంటే పనిచేసే సేవకులనే భావం నుండి ఉద్భవించిందే. ఇంటిపని, వంటపని అంతా మహిళలపైనే మోపుతున్నారు. ఈ తరగతుల్లో 'ఐద్వా' మంచి చొరవతో ఉద్యమాన్ని నిర్మిస్తోంది. దీన్ని మరింత ముందుకు తీసుకెళ్లాలి. వలస మహిళా కార్మికుల జనాభా పెరుగుతోంది. వీరంతా పట్టణాల్లో మురికివాడల్లో నెట్టుకొస్తున్నారు. 'ఐద్వా' గ్రామీణ మహిళ పునాదిగా, పట్టణ మురికివాడల జీవితాన్ని మరింత అధ్యయనం చేస్తూ, ఈ వలస మహిళా కార్మికులను సంఘటితంచేసే కృషి చేయాలి.

ఈ కాలంలో అన్ని వైపుల నుండీ గిరిజన మహిళలపై దాడి, అత్యాచారాలు పెరిగిపోయాయి. అటవీహక్కుల చట్టాలను నీరుగారుస్తున్నారు. చిన్న చిన్న అటవీ ఉత్పత్తుల ద్వారా జీవనం సాగించేవీరిని భూసేకరణ, కబ్జాలతో అడవిని ధ్వంసం చేస్తూ పాలకవర్గాలు వీరి జీవితాన్ని ఛిద్రం చేస్తున్నాయి. గిరిజనుల నిరసనలను, మావోయిస్టు చర్యలుగా కొట్టిపారేస్తున్నారు. వేలమంది అమాయక గిరిజనులపై తప్పుడు కేసులు బనాయించి జైళ్లచుట్టూ, కోర్టులు చుట్టూ తిప్పుతున్నారు. ఈ మధ్యనే మన సీఈసీ సభ్యురాలు అర్చనా ప్రసాద్, ఛత్తీస్‌ఘడ్ సీపీయం కార్యదర్శి సంజయ్‌పరాటె, ఆదివాసీల ఉద్యమ ప్రముఖుడు ప్రొ॥ నందిని సుందర్‌లపై ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం అక్రమ కేసులు బనాయించింది. వెంటనే కేసులు రద్దు చేయాలని డిమాండ్ చేస్తున్నాం. మావోయిస్టులకు, ప్రభుత్వాలకు మధ్య అడకత్తెరలో పోకచెక్కల్లా గిరిజనులు నలిగిపోతున్నారు. 'ఐద్వా' వారి సమస్యలను తీసుకొని పోరాడాలి.

పార్లమెంట్ ఎన్నికలు జరిగి రెండున్నర సంవత్సరాలు గడిచిపోయింది. అయినా నరేంద్రమోడీ ఎన్నికల హామీలను అమలు

చేయడంలో విఫలమయ్యారు. ఈ వైఫల్యాన్ని కప్పిపెట్టేందుకు, ప్రజలదృష్టిని మళ్లించేందుకు పెద్దనోట్లు రద్దు ప్రకటిం చారు. 86% కరెన్సీని నల్లధనంపై దాడి పేరుతో రద్దు చేశారు. రెండు నెలలు దాటినా ఇందులో ఇసుమంతైనా ఫలితం లేదు. ఏదోకొద్దిగా అక్కడక్కడ పట్టుబడ్డ పన్నుఎగవేతదారుల నుండి దొరికిన నగదుతప్ప మరే నల్లడబ్బు బయటకు రాలేదు.

అప్పటికే అదంతా తెల్లధనంగా మారిపోయింది. స్విస్‌బ్యాంకుల్లో, స్వర్గధామం వంటి దేశాలకు నల్లడబ్బు చేరిపోయింది. కానీ నోట్ల రద్దు తీవ్రమైన ఇబ్బందులను ప్రజలకు తెచ్చిపెట్టింది. ముఖ్యంగా చిన్న చిన్న పొదుపుదారుల వేదనలు వర్ణనాతీతం. ఒక పక్క గంటలు తరబడి క్యూలో నిలబడడంతో సరిపో తోంది. రద్దుచేసిన కరెన్సీలో కనీసం 20% కూడా తిరిగి ప్రభుత్వం ప్రింట్ చేయలేదు. కోట్ల మంది ప్రజల జీవనాన్ని అతలాకుతలం చేసింది నోట్ల రద్దు. ముఖ్యంగా కార్మికులు, రైతులు చిన్న చిన్న దుకాణాదారుల జీవి తాన్ని తీవ్రంగా దెబ్బతీసింది. పరిశ్రమలు, కాఫీ, పండ్లతోటలు ముఖ్యంగా అసంఘటిత కార్మికులుండే సంస్థలపై తీవ్రమైన ప్రభావంతో వారంతా ఉపాధి కోల్పోతున్నారు.

సంవత్సరానికి రెండు కోట్ల ఉద్యోగాలన్నమాట గాలికి ఎగిరిపోయింది. ఉన్న ఉపాధిని గల్లంతు చేసేస్తున్నారు. కోట్లాది మంది ఉపాధి కోల్పోయారు.

పెట్టుబడిదారీ విధానం మహిళలకు సమానత్వం సాధించటంలో తీవ్రంగా విఫలమైంది. అంతేకాదు, సరళీకరణ, పెట్టుబడిదారీ విధానం అంతరాలను మరింత పెంచాయి.

మహిళా విముక్తికై మన పోరాటాలు అన్యాయానికి వ్యతిరేకంగా మాత్రమే కాదు, ప్రజాస్వామ్య హక్కులు, సమానత్వంతో కూడిన సామాజిక దృక్పథం మాత్రమే మహిళా విముక్తిని గ్యారంటీ చేయగలదు. బోల్షివిక్ పార్టీ లెనిన్ నాయకత్వంలో సాధించిన అక్టోబరు విప్లవం శత వార్షికోత్సవం ఈ సంవత్సరం జరుపుకుంటున్నాం. తొట్టతొలి వామపక్ష మహిళా ఉద్యమాలు ఈ అక్టోబరు విప్లవం నుండే స్ఫూర్తిని పొందాయి. మొట్టమొదటి సోషలిస్టు రాజ్యమైన రష్యాలో మహిళలు సాధించిన ప్రగతి భారతీయ మహిళలకు మంచి స్ఫూర్తిని కలిగించింది. సామాజిక, ఆర్థిక, విద్య, వైద్య, న్యాయ తదితర రంగాల్లో లెనిన్, బోల్షివిక్ పార్టీ నాయకత్వంలో సోషలిస్టు రష్యాలో మిగిలిన దేశాలతో పోల్చి చూసినపుడు విప్లవాత్మకమైన మార్పులు చేశారు. ఇవన్నీ మహిళల జీవితాన్ని ప్రభావితం చేశాయి. మహిళల సామాజిక హోదాను, పురుషులతో సమాన స్థాయికి పెంచారు. సమానత్వం దిశగా, వివక్షకు వ్యతిరేకంగా కృషి చేశారు.

సమానత్వం, విముక్తి అంతకంతకూ సోషలిజంలోనే సాధ్యం అనేది మరింత ప్రస్ఫుటమయ్యింది.

ఈ మధ్యనే మార్క్సిస్టు విప్లవ యోధుడు కా॥కాస్ట్రో మరణించారు. ఈ రోజు సమావేశ ప్రారంభంలో ఆయనకు మనం నివాళు లర్పించాం. లెనిన్ వారస త్వాన్ని కాస్ట్రో కొనసాగించారు. అనేక విజయాలను సాధించారు కాస్ట్రో. ముఖ్యంగా సోషలిస్టు క్యూబాలో మహిళా విముక్తి అంశంలో, శతాబ్దాల దోపిడీని అణిచివేత నుండి మహిళలను విముక్తి చేయడంలో ఆయన అనేక విజయాలు సాధించారు.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి చిహ్నం ఫైడల్ కాస్ట్రో. ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలకు దన్నుగా నిలబడ్డారు. సామ్రాజ్యవాదమే ఈ ప్రపంచానికి ప్రబల శత్రువని నినదించారు కాస్ట్రో.

నేటికీ సామ్రాజ్యవాదం అనేక వేల మందిని హతమార్చే యుద్ధాలలో ఇంకా తన మరణ మృదంగాన్ని మోగిస్తూనే ఉంది. ఈ యుద్ధాల్లో అత్యంత బాధితులు మహిళలు, చిన్నపిల్లలే. పాలస్తీనా స్వాతంత్ర్యం కొరకు పోరాటం కొనసాగిస్తూనే ఉంది. పిడికిలెత్తి, సౌహార్ధంగా వారితో గొంతులు కలుపుదాం.

నవంబర్ 16, అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో, అత్యంత తిరోగమన శక్తులకు ప్రతినిధిగా ఉన్న ట్రంప్ గెలిచాడు. వర్ణ విద్వేషం, జాతివిద్వేషాలతో కూడిన ఎన్నికల ప్రచారం చేశాడు ట్రంప్. రాబోయే కాలంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం మరింత తీవ్రతరం కాబోతోంది. 'ఐద్వా' ఎప్పటివలనే ఈ పోరాటంలో భాగస్వామవుతుంది.

ఈ చారిత్రక వాస్తవాలన్నీ వర్గాలుగా చీలిపోయిన ఈ సమాజంలో కూడా మహిళా విముక్తి సాధ్యమేనని తెలియజే స్తున్నాయి. మహిళా విముక్తికై సాగే పోరాటం, పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరే కంగా జరిగే రోజువారీ పోరాటంతో ముడి పడివుంది. ఈ పోరాటాన్ని ముందుకు తీసుకెళ్లాలి. ఐక్యత, దీక్షాబద్ధత, బలమైన కృషితో ఈ పోరాటాన్ని మరింత బలోపేతం చేయాలి.

'ఐద్వా' వర్ధిల్లాలి

'ఐద్వా' జిందాబాద్!!

**మనువాద సంస్కృతిని తిరస్కరిద్దాం! ప్రజాస్వామిక సంస్కృతిని బలపరుచుకుందాం!!**

35ఏళ్ల ప్రస్థానంలో ఐద్వా..

వ్యాసం

# ఆర్థిక విధానాలపై సవాల్

- కిరణ్ మోఘే

'ఐద్వా' గడిచిన 35 సంవత్సరాల్లో మహిళల ఆర్థిక సమస్యల గురించి పోరాటాలుగాని, ప్రచారం గానీ చెయ్యని రోజు బహుశా ఒక్కటి కూడా లేదు. ఆర్థిక రంగంలో స్త్రీలు పూర్తిగా, సమానంగా పాల్గొనకపోతే మహిళలు సమానత్వమూ, విముక్తి సాధించలేరు. ఈనాటి కుల కట్టుబాట్లు, పితృస్వామ్య వ్యవస్థ, పెట్టుబడి దారీ సమాజంలో వాళ్లు ఎదుర్కొంటున్న అనేక రకాల హింస, వివక్షతలపై నిరంతర పోరాటం ద్వారానే మహిళలు ఉత్పాదనలో సమానంగా పాల్గొనగలరు. ఈనాటి సమాజంలో ఆర్థిక వ్యవస్థలో, కుటుంబ వ్యవస్థలో స్త్రీల అసమానమైన కృషిని కనపడకుండా చేయడం లేదా తగ్గించే ఈనాటి ఆర్థిక నమూనాలను, చర్యలను 'ఐద్వా' సవాల్ చేస్తుంది. 35సంవత్స రాలుగా జరుగుతున్న పోరాటాలను, మన పాత్రను వివరించడం ఈ కొద్ది వ్యాసంలో అసాధ్యం. అందువలన స్త్రీల ఆర్థిక హక్కుల గురించి, 'ఐద్వా' చేసిన కొన్ని ప్రధానమైన ప్రచారాలను, పోరాటాలను మాత్రమే వివరించే ప్రయత్నమిది.

**మహిళా కార్మికుల పని-ఉపాధి హక్కులు:** -నిస్సందేహంగా మహిళల పని-ఉపాధి, వారి హక్కుల విషయంలో జోక్యం చేసుకోవటం ప్రధానమైనది. 1981లో మద్రాసులో జరిగిన మహాసభలో 'ఐద్వా' కొన్ని ప్రధానమైన తీర్మానాలు చేసింది. అందులో తగ్గిపోతున్న మహిళల ఉపాధి గురించి, మహిళల పట్ల జరుగుతున్న వివక్ష గురించి, వేతనంలో, అవకాశాల్లో వివక్ష గురించి. సమాన పనికి సమాన వేతనం, భద్రత పరిస్థితులు, ప్రసూతి సౌకర్యాలు. శిశువుల రక్షణ, వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్స్ గురించి ప్రత్యేక రెస్ట్ రూమ్స్ మొదలగు వాని గురించి పేర్కొంది. పని హక్కును ప్రాథమిక హక్కుగా చేర్చటం 'ఐద్వా' ప్రధాన డిమాండ్లలో ఒకటి. 80వ దశకంలో సంప్రదాయక పొగాకు, పీచు పరిశ్రమల్లో లక్షలాది మంది మహిళలు ఉపాధి కోల్పో యారు. 1982,ఆగస్టు 18న "ఉపాధి దినముగా" 'ఐద్వా' ఇచ్చిన పిలుపు మేరకు అనేక రాష్ట్రాల్లో మహిళలు సమగ్ర కోర్కెల పత్రాలతో ఉత్సాహంగా పాల్గొన్నారు. 6వ పంచవర్ష ప్రణాళికా పత్రంలో 'ఐద్వా' తన విమర్శలో ఉద్యోగ అవకాశాల్లో మహిళలను ప్రత్యేక లక్ష్యంగా చేపట్టకుండా వదిలి వేయటాన్ని మన సంఘం ఎత్తి చూపింది. మహిళల స్వయంఉపాధి కల్పనా పథకాలు, అసంఘటిత రంగంలో ఉపాధి కల్పనలతో గృహ సంబంధ పరిశ్రమలను కొనసాగిం చింది. పని, ఉపాధి సరైన వేతనం గురించి వేలమంది మహిళలతో ఢిల్లీలో1989 సెప్టెంబరు 8న చారిత్రాత్మకమైన "మార్చ్ టు పార్లమెంటు"జరిగింది.

ఆనాడు మహిళల జీవితాలపై పాలక వర్గ ఆర్థిక విధానాలు అనేక రంగాల్లో



తీవ్రమైన ప్రభావం చూపాయి. 'ఐద్వా' కొన్ని ప్రత్యేక తరగతుల మహిళా శ్రామికులపై దృష్టి సారించింది. భారత ప్రభుత్వ ఐ.సి.డి.ఎస్. పథకంలో లక్షల్లో పనిచేస్తున్న అంగన్‌వాడీ కార్మికులు, వారి సహాయకులు నూతనంగా ఆవిర్భవిస్తున్న ఒక తరగతి. స్వచ్ఛంద సామాజిక సేవ పేరుతో వీరికి నామమాత్రపు గౌరవ వేతనం చెల్లిస్తున్నారు. వారి పోరాటం కేరళలో మొదలై అన్ని రాష్ట్రాల్లో అత్యంత వేగంగా వ్యాపించింది. జాదవపూర్‌లో నవంబరు 1990లో జరిగిన 'ఐద్వా' 3వ మహాసభలో అంగన్‌వాడీ ఉద్యోగుల రెగ్యులరైజేషన్‌కి పిలుపు ఇచ్చింది. తరువాత 'ఐద్వా' శాఖలు వారిని యూనియన్‌గా సంఘటిత పరచి వారి పోరాటానికి మద్దతు ఇచ్చింది. ఇదే విధంగా వివిధ ప్రభుత్వ పథకాల్లో పని చేస్తున్న స్కీమ్ వర్కర్స్‌కి 'ఐద్వా' సహకారం ఇచ్చింది.

1991లో ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానం వలన మహిళల జీవితాలపై తీవ్ర దాడి జరిగిందన్నది స్పష్టమైంది.

'ఐ.యం.ఎఫ్', ప్రపంచ బ్యాంకు ఆదేశాను సారం అప్పటి కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వం అమలు చేసిన విధానం వల్ల బ్యాంకు కోల్ ఇండస్ట్రీ ఎయిర్ లైన్స్‌లో ప్రభావితమైన వి.ఆర్.ఎస్. స్కీమ్, రిట్రెంచ్‌మెంట్ పెన్షన్ స్కీములను 'ఐద్వా' వ్యతిరేకించింది. 1994 కోయంబత్తూర్‌లో జరిగిన 'ఐద్వా' జాతీయ మహాసభలో గ్రామీణ, పట్టణ మహిళా కార్మికుల పనికి సంబంధించి దోపిడీ వ్యతిరేక పోరాటాలను చేపట్టాలని పిలుపు నిచ్చింది. 1995 జులై ఢిల్లీలో జాతీయ సదస్సుకు ముందు అనేక రకాలైన పనులు చేసే మహిళా కార్మికులు ఎంబ్రాయిడరీ, పూలదండల వ్యాపారం, బొమ్మలు తయారు చేయటం, ఎలక్ట్రానిక్స్, చేతిపనివారలు, బీడీ, అగర్‌బత్తి, పాపడ్ మొదలగు వాటి గురించి 11 రాష్ట్రాల్లో విస్తృత సర్వే జరిగింది. ఏమైనప్పటికీ వాళ్లను సమీకరించటంలో ఉన్న సమస్యల దృష్ట్యా ఇతర చోట్ల మన జోక్యం చాలా తక్కువగా ఉన్నప్పటికీ ఢిల్లీలో అలాంటి మహిళా కార్మికులు ఒక ప్రత్యేక సంఘంలో భాగస్వాములయ్యారు. తదుపరి కాలంలో ఈ సంస్థ గృహకార్మికులు ఎదుర్కొంటున్న దోపిడీ పని పరిస్థితులు, లైంగికదోపిడీ, కుల వివక్ష వంటి సమస్యలను ఎత్తి చూపడంలో ప్రధానపాత్ర వహించింది. వాళ్లను యూని యన్‌లో సమీకృతం చేయడంలో 'ఐద్వా' ఇంటిపని విలువను తగ్గించడం, మహిళల పనికి చెల్లించని శ్రమకు చెల్లించవలసిన ఆవశ్యకత పేర్కొంది.

**మహిళలు చేస్తున్న అనేక రకాల పనులకు పురుషులకంటే తక్కువ వేతనం చెల్లిస్తున్నారు. దానిని పునఃనిర్ణయించాలని డిమాండ్ చేసింది. మహిళలకు వేతన నిర్ణయ సంప్రదింపులు కనీస వేతన బోర్డు ప్రాతినిధ్యం ఇవ్వాలని 'ఐద్వా' డిమాండ్ చేసింది. భూమి పత్రాల్లో మహిళల పేర్లు లేనందువలన వారిని తొలగించి కనబడకుండా చేయడ మన్నది కూడా హైలైట్ చేశారు. మహిళలను వ్యవసాయ కార్మికులను "ప్రాజెక్ట్ ఎఫెక్టెడ్ పర్సన్స్" (ప్రాజెక్ట్ బాధితులుగా) పరిగణించి ప్రత్యామ్నాయ ఉపాధి నష్టపరిహారం 'ఐద్వా' డిమాండ్ చేసింది.**

కోయంబత్తూర్‌లో జరిగిన మహాసభ వ్యవసాయ, వ్యవసాయేతర రంగాల్లో పని చేస్తున్న గ్రామీణ కార్మికుల సమస్యల గురించి శ్రద్ధ వహించాలని పిలుపునిచ్చింది. 8 రాష్ట్రాల్లో మహిళా వ్యవసాయ కార్మికులు సదస్సులు జరిగాయి. భవిష్యత్తులో పని చేయడానికి గ్రామీణ మహిళల కోర్కెల పత్రం రూపొందించారు. మరో ముఖ్య విషయము మహిళలు చేస్తున్న అనేక రకాల పనులకు పురుషులకంటే తక్కువ వేతనం చెల్లిస్తున్నారు. దానిని పునఃనిర్ణయించాలని డిమాండ్ చేసింది. మహిళలకు వేతన నిర్ణయ సంప్రదింపులు ఉండాలని, కనీస వేతన బోర్డు ప్రాతినిధ్యం ఇవ్వాలని 'ఐద్వా' డిమాండ్ చేసింది. భూమి పత్రాల్లో మహిళల పేర్లు లేనందువలన వారిని తొలగించి కనబడకుండా చేయడమన్నది కూడా హైలైట్ చేశారు. మహిళలను, వ్యవసాయ కార్మికులను ప్రాజెక్ట్ బాధితులుగా పరిగణించి ప్రత్యామ్నాయ ఉపాధి నష్టపరిహారం 'ఐద్వా' డిమాండ్ చేసింది. శక్తి వంతమైన ఎం.ఎన్.సి, ఎన్‌రాన్ వ్యతిరేక పోరాటం, ఇతర వాణిజ్య ప్రాజెక్టులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో 'ఐద్వా' చురుకైన పాత్ర వహించింది. సారవంతమైన వ్యవసాయ ప్రైవేటు భూములను అభివృద్ధి ప్రాజెక్టుల పేరుతో చాలా విశాలమైన ప్రాంతాలను స్వాధీనం చేసుకోవడానికి వ్యతిరేకంగా ఇతర రైతు వ్యవసాయ, కార్మిక సంఘాలతో కలిసి భూసేకరణ చట్టం గురించిన చర్చల్లో 'ఐద్వా' తనవంతు పాత్ర వహించింది. మహిళలకు కూడా సమాన ఆస్తి హక్కు ఉండాలని చేస్తున్న డిమాండ్ వ్యవసాయ భూములు, ప్రభుత్వం ఇచ్చిన భూములకు జాయింటు పట్టాలు ఇచ్చిన వామపక్ష సంఘటన ప్రభుత్వ విధానాలను అనుసరించాలన్న మన దీర్ఘకాలిక డిమాండ్ ఫలితాలనిచ్చింది. గ్రామీణ నిర్మాణ కార్మికులు, వ్యవ సాయ కార్మికులు, క్యాజువల్ సిబ్బందితో పనిచేసిన అనుభవం వలన గ్రామీణ ఉపాధి హామీ చట్టం ఆమోదింప జేయడానికి ప్రధానంగా ఉపయోగపడింది. దేశవ్యాప్తంగా డిసెంబర్ 10న మానవ హక్కుల దినమును "డిమాండ్స్‌డేగా" పాటించారు. 'ఐద్వా' సార్వజనీన హామీ, కనీస, సమాన వేతనాలు చట్టమైన క్రెచెస్, కేర్‌సెంటర్స్ ఏర్పాటు పేరుతోపాటు ప్రత్యేక జాబ్ కార్డ్స్ మహిళలకు ఇవ్వాలని, చట్టము పట్టణాల్లో విస్తరిం చాలని ఒత్తిడిచేసింది. ప్రభుత్వం సంవత్సరానికి 100 రోజులుగా కుదించినప్పుడు 'ఐద్వా' మూడో వంతు పని దినాలు మహిళలకు కేటాయించాలని, విజయ వంతమైన

ప్రచారం చేసింది. ఏమైనప్పటికీ మహిళలు చేసే పని పద్ధతులను వేరుగా లెక్కించాలని డిమాండ్ చేయటంతో 'ఐద్వా' కృషి ప్రధానమైనది. ఈనాటికీ 'ఐద్వా' కార్యకర్తలు ఈ ఏర్పాటు కల్పనకు, అమలుకు ముందున్నారు.

**ధరల పెరుగుదల, ప్రజాపంపిణీ వ్యవస్థ , ఆహార భద్రత :**ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాల వలన పెరుగుతున్న ధరల సమస్య కీలకమైనది. నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల, ముఖ్యంగా ఆహారం, ఇంధనం వలన మహిళల ఇంటి బడ్జెట్ ప్రత్యక్షంగా ప్రభావం చూపటంపై అసంఖ్యాకంగా ప్రదర్శనలు, ధర్నాలు గ్రామీణ, పట్టణ, నగరాల్లో చేశారు. ప్రభుత్వ లోపభూయిష్టమైన సరఫరాలు, స్పెక్యులేటివ్ వ్యాపారాల వలన పొటాటో, ఉల్లి, షుగర్, మిల్క్, పప్పుధాన్యాల ధరలు పెరిగి ప్రజా ఉద్యమాలు, ప్రత్యక్ష కార్యా చరణలు, అరెస్టులు బంద్‌లు జరిగాయి. ప్రత్యేకంగా ప్రభుత్వం ధరల నియంత్రణ వ్యవస్థ నుండి తప్పుకోవడం వలన,పెట్రోలు ఉత్పత్తుల్లో భారీ పెరుగుదలతో ద్రవ్యోల్బణ పరిస్థితి ఏర్పడటాన్ని 'ఐద్వా' నిరసించింది. దీనికి తోడు రైల్వే, పాసింజర్, రవాణా చార్జీలు పెంచటం వలన, రోడ్డు రవాణా చార్జీల పెరుగుదల వలన నిత్యావసర వస్తువుల ధరలపై తీవ్ర ప్రభావం చూపుతుంది. బియ్యం, పప్పు ధాన్యాలు మొదలగు నిత్యావసర వస్తువుల్లో 'స్పెక్యులేటివ్' మార్కెట్‌ను నిషేధించాలని, 14 నిత్యావసర వస్తువులు ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా అందుబాటులో ఉంచాలని ఐద్వా పదేపదే డిమాండు చేసింది. అయినప్పటికీ ఈ కాలంలో పి.డి. ఎస్.ను పటిష్టపరచాలని, సమర్ధ వంతంగా నడపాలనీ మిలిటెంట్ కార్యాచరణలు జరిగాయి. 1996లో యునైటెడ్ ప్రభుత్వం లక్షిత లబ్ధిదారుల విధానాన్ని పూర్తిగా వ్యతిరేకించింది. నిత్యావసర వస్తువులు చౌక ధరలకు పీడీఎస్ ద్వారా అందజేయాలని గట్టిగా కోరింది. లోపభూయిష్టమైన నిబంధనలతో అనేక మంది పేదలు, ఒంటరి మహిళలతో సహా బీపీఎల్ కార్డులు పొందలేకపోయారని, వారందరికీ కార్డులు ఇవ్వాలని 'ఐద్వా' చారిత్రాత్మక పోరాటాలు నిర్వహించింది. 2003 ఏప్రిల్‌లో జాతీయ సంఘర్ష సభలో ఆమోదించిన తీర్మానాన్ననుసరించి లక్షిత ఆహార భద్రత వ్యవస్థకు సంబంధించిన సమస్యలపై పార్లమెంట్ ముందు మిలిటెంట్ ప్రదర్శనలు జరిగాయి. పేదలు ఆకలితో అలమటించకుండా ఎఫ్.సి.ఐ గోడౌన్లలో ఆహార ధాన్యాలు ముక్కిపోయిన అంశంపై గోడౌన్ల ముందు ఘేరావ్ చేశారు. కాంగ్రెస్, బీజేపీ ప్రభుత్వాలు ఆహార సబ్సిడీలు తగ్గించడం వలన అనేకమంది అర్హులను ఆ సదుపాయాల నుండి తొలగించారు. లెక్కలేనన్ని సర్వేలు, గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో అర్జీలు, కార్యాచరణల ద్వారా 'ఐద్వా' ఎత్తిచూపింది. ప్లానింగ్ కమీషన్ హెడ్ క్వార్టర్స్ ఢిల్లీలో ఈ సమస్యలపై 2010న మిలిటెంట్ డెమానిస్ట్రేషన్ చేసి, 'ఐద్వా' వెలుగులోనికి తెచ్చింది. జాతీయ ఆహార భద్రత చట్టంలో కొనసాగించిన లక్షిత నిబంధనలకు అదనంగా కల్పించిన నగదు బదిలీ, ఆధార్, బ్యాంకు అకౌంటుతో అనుసంధానం లాంటి నూతన అడ్డంకులకు వ్యతిరేకంగా ఆగస్టు జాతీయ సదస్సులో ఎత్తిచూపి, 2012 లో ఆహారం పౌరసరఫరాల మంత్రిత్వశాఖ పార్లమెంటరీ 2011న స్టాండింగ్ కమిటీకి మెమోరాండం సమర్పించారు. ఈనాటికీ పటిష్టమైన ఆహార భద్రత వ్యవస్థ కోసం 'ఐద్వా' పోరాటం చేస్తోంది. దీనికి తోడుగా మధ్యాహ్న భోజన పథకంలో నాణ్యత, పౌష్టికాహార సమస్యలపై ఐసీడీఎస్ తదితర ఆహార భద్రత పథకాలు క్రమంగా ప్రైవేటీకరణ చేయడాన్ని ఎమ్.ఎన్.సిల ప్యాకేజీ ఫుడ్ చర్యల పథకాలపై 'ఐద్వా' జోక్యం చేసుకొంది.

**స్వయం సహాయక బృందాలు, మైక్రోఫైనాన్స్:** ప్రభుత్వం నమూనా స్వయం సహాయక గ్రూపులను ఆర్థిక సాధికాతకు ప్రత్యక్ష ఉపాధి కార్యక్రమాలకు ప్రత్యామ్నాయంగా ప్రారంభించినపుడు 'ఐద్వా' అనేక విధాలుగా జోక్యం చేసుకొంది. అందులో 'ఐద్వా' శాఖలు అనేక రాష్ట్రాల్లో చాలా ఎస్.హెచ్.జి.లు ప్రారంభించింది. హిమ్మత్ అనే కేంద్ర సంస్థ కింద ఈ కృషి ప్రారంభమయింది. జనవరి 2007 తిరువనంత పురంలో ఈ పద్ధతిని ప్రత్యేక వర్క్‌షాపులో సమీక్షించింది. వామపక్ష సంఘటన ప్రభుత్వం ఉన్న పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపుర ఎస్.జి.హెచ్. ఎస్.కి మద్దతిచ్చి, ట్రైనింగ్, తక్కువ వడ్డీకి నిర్వహణ, పెట్టుబడి, ఉత్పత్తులకు మార్కెటింగ్ సదుపాయం కల్పించాయి. అనేక ఇతర రాష్ట్రాల్లో ప్రభుత్వాల నుండి శిక్షణ, మార్కెటింగ్ మద్దతు లేక పోవడం, అవినీతి మొదలగు సమస్యలపైన 'ఐద్వా' ఉద్యమం

**ఇతర మహిళా సంస్థలతో గ్రూపులతో సంయుక్తంగా జరిపిన ఈ చర్యలవలన ప్రభుత్వం బడ్జెట్లో ప్రకటించిన విధానాలకు నిజంగా అమలు చేసిన వాళ్ళకి పోల్చి చేసే అవకాశం, మరియు మహిళలు కూడ ప్రభుత్వ ఆర్థిక విధానాలలో ఆ మిగతా దేశ ప్రజలలాగ మహిళలు కూడ భాగస్వామ్యములేనని వెల్లడించడం జరిగింది. ఈనాడు ఐద్వా ఈ అనుభవాన్ని స్థానిక సంస్థలు, ప్రభుత్వ, రాష్ట్రస్థాయి సంస్థలకు విస్తరించుచున్నవి.**

చేపట్టింది. ఎస్.హెచ్.జి లను ఉపయోగించి నేషనల్ రూరల్ లైవ్‌లీ హుడ్స్ మిషన్, స్వర్ణ జయంతి గ్రామీణ రోజ్‌గార్ యోజన మోడల్స్ గ్రామీణ మహిళల జీవనోపాధి కల్పనకు ఉపయోగించటాన్ని 'ఐద్వా' నిరసించింది. కేరళలో కాంగ్రెస్ ప్రభుత్వ అలసత్వం నుండి కుటుంబ స్త్రీ పథకాన్ని రక్షించడానికి బ్రహ్మాండమైన పోరాటాన్ని చేసింది. ఒరిస్సా ఎన్.ఆర్. ఎల్.ఎమ్‌లో ఎస్.హెచ్.జిలో ఎదుర్కొంటున్న సమస్యను 'ఐద్వా' మార్గదర్శక సర్వేలో ఎత్తిచూపింది.

ఒకవైపు ఎస్.హెచ్.జి.లు విజయవంతంగా అప్పులు తిరిగి చెల్లించడం మైక్రోఫైనాన్స్ సంస్థలు ఎక్కువ వడ్డీకి అప్పులు ఇచ్చే అవకాశం కల్పించింది. మైక్రోఫైనాన్స్ సంస్థల చక్రబంధంలో చిక్కుకున్న మహిళలు ఆంధ్రప్రదేశ్‌లో ఆత్మహత్యలు చేసుకున్నారు. 'ఐద్వా' జాతీయ స్థాయిలో సర్వేలు, ర్యాలీలు, సదస్సులు నిర్వహించి ఎం.ఎఫ్.ఐ. దోపిడీ పద్ధతులను అరికట్టాలని డిమాండ్ చేసింది.

మద్రాస్ హైకోర్టు మధురై బెంచిలో తమిళనాడు రాష్ట్ర కమిటీ వేసిన 'పిల్' ద్వారా ఎం.ఎఫ్.ఐ.ని క్రమబద్ధీకరించాలని ప్రభుత్వం ఆదేశం ఇచ్చేట్లు చేసింది. రిజర్వ్ బ్యాంకు గవర్నరుకు ఛార్టర్ ఆఫ్ డిమాండ్స్ ద్వారా ఎం.ఎఫ్.ఐ.సంస్థలను క్రమబద్ధీకరించాలని ఎస్.హెచ్.జి కి అప్పులు ఇవ్వాలని విజ్ఞాపన చేసింది. ఇది జరిగిన తరువాత ప్రాధాన్యత రంగాలకు రుణ సదుపాయాల గురించి ఆర్.బి.ఐ. ప్రత్యేక కమిటీ ముందు నివేదిక ఇవ్వాలని 'ఐద్వా'ని ఆహ్వానించింది. పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ చేపట్టిన ఎమ్ఎఫ్ఐ రెగ్యులేషన్ బిల్లు ముసాయిదా సమీక్షకు కీలకమైన సూచనలు చేసింది. బిల్లును తరువాత నిలిపివేశారు.. ఎస్.హెచ్.జి.సమస్యలు కొనసాగుతున్నాయి.. ప్రత్యేకంగా ఐ.సి.డి.ఎస్. పౌష్టికాహార సరఫరా పథకాలు, మధ్యాహ్న భోజన పథకాలు ప్రభుత్వం జాతీయ లైవ్‌లీ హుడ్ మిషన్ నిబంధనల్లో మార్పులు చేసి, పట్టణాలకు విస్తృతపరిచింది. ఈ రంగాల్లో భవిష్యత్తులో మనం దృష్టి సారించాల్సుంది.

**బడ్జెట్స్ మరియు మహిళలు :**

అనేక ప్రభుత్వ విధానాలు వార్షిక బడ్జెట్ ద్వారా అమలు చేస్తున్న విషయం గుర్తించిన 'ఐద్వా' కేంద్ర ప్రభుత్వ బడ్జెట్‌లను విమర్శనాత్మకంగా పరిశీలించడానికి ప్రత్యేక ప్రయత్నాలు చేసింది. దీనికి ముందు ఆర్థిక మంత్రికి బడ్జెటు ముందు మహిళా సంఘాలతో, వ్యాపారవేత్తలతో లాగానే సంప్రదింపులు జరపాలని, గుర్తించాలని వినతి పత్రము ఇచ్చింది. (ఇతర మహిళా సంస్థలతో గ్రూపులతో సంయుక్తంగా జరిపిన ఈ చర్యలవలన ప్రభుత్వం బడ్జెట్లో ప్రకటించిన విధానాలకు నిజంగా అమలు చేసిన వాటికి పోల్చి చూసే అవకాశం, ప్రభుత్వ ఆర్థిక విధానాలలో మిగతా దేశ ప్రజలలాగ మహిళలు కూడ భాగస్వామ్యములేనని వెల్లడించడం జరిగింది. ఈనాడు ఐద్వా ఈ అనుభవాన్ని స్థానిక సంస్థలు, రాష్ట్ర ప్రభుత్వ స్థాయి సంస్థలకు విస్తరించుచున్నది.

ఇవి 'ఐద్వా' జాతీయ ఆర్థికవిధానాల్లో జోక్యం చేసుకొన్న కొన్ని మాత్రమే. అనేక విషయాలను విస్తృతంగా 'అధ్యయనం' చేసింది. ప్రస్తుత ఆర్థికరంగంలో స్త్రీలు ఏవిధంగా వివక్షతకు గురి అవుతున్నారో విమర్శనాత్మకంగా బహిరంగ పోరాటం ద్వారాఎత్తి చూపింది. అదే సమయంలో ఆర్థిక రంగంలో స్త్రీల ప్రత్యేక పాత్రను గుర్తించవలసిన అవసరాన్ని వారికి ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాలను డిమాండ్ చేస్తూ శక్తి వంతమైన మహిళా సంస్థల నిర్మాణానికి కేంద్రబిందువుగా ఉంది.

'ఐద్వా' అంతిమ లక్ష్యం, ఈనాటి పెట్టుబడిదారీ వ్యవస్థను సవాల్ చేస్తూ, మహిళా ఉద్యమాన్ని బలంగా నిర్మించి మహిళలకు చెల్లించని, మరి తక్కువగా చెల్లించిన శ్రమకు తగిన ప్రతిఫలం సాధించడం. పితృ స్వామిక, వివక్షాపూరిత, కుల దోపిడీలను అంతం చేయవలసి ఉంది. రానున్న రోజుల్లో ఈ పోరాటాలను 'ఐద్వా' కొనసాగిస్తుంది.

# ఉదారవాద మత రాజ్యంపై పోరుకు ఐద్వా పిలుపు

వ్యాసం

- డి.రమాదేవి



హింసలేని సమాజం కొరకు ఏకమవుదాం అంటూ ప్రతిధ్వనిస్తున్న నినాదాల మధ్య ఐద్వా జెండా ఆవిష్కరణతో భోపాల్ లోని శ్యామిలీ గుప్తానగర్‌లో 2016 డిసెంబర్ 10న ఐద్వా 11వ అఖిల భారత మహాసభలు ప్రారంభమయ్యాయి. ఆ రోజు జరిగిన బహిరంగ సభలో కేరళ ముఖ్యమంత్రి పినరయి విజయన్ ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. మహిళా హక్కులు, శ్రామిక మహిళల హక్కుల కొరకు ఐద్వా సాగిస్తున్న పోరాటాలు అభినందనీయం అని అన్నారు.

బిజెపి ప్రభుత్వం మత విద్వేషాన్ని పెంచేందుకు సంఘపరివార్ శక్తులకు స్వేచ్ఛనిచ్చిందని, మోరల్ పోలీసింగ్‌తో మహిళలు, దళితులు, మైనారిటీలపై దాడులు పెరిగాయని ఆందోళన వెలిబుచ్చారు. కేరళలోని వామపక్ష ప్రభుత్వం ఆయా తరగతుల ప్రజల హక్కులను కాపాడుతూ సంక్షేమ చర్యలు చేపడుతోందని, కానీ బిజెపి ప్రభుత్వాలు హర్యానా, రాజస్థాన్‌లలో 80 శాతం మంది మహిళలు పంచాయితీల్లో పోటీ చేయడానికి వీల్లేకుండా (అర్హత లేకుండా) రాజ్యాంగ విరుద్ధంగా చట్టాలు చేశాయని, వ్యాపం కుంభ కోణంలో మధ్యప్రదేశ్ ప్రభుత్వం అవినీతిపరులను కాపాడుతోందని, ఎన్‌కౌంటర్లతో ముస్లిం యువకులను హత్య చేసిందని, ప్రజా స్వామిక హక్కుల రక్షణతోనే మహిళా హక్కులను అమలు చేసుకోగలమని సందేశమిచ్చారు.

నజీబ్ అహ్మద్ అదృశ్యం, రోహిత్ మరణం, ఈ దేశంలో తల్లులను రోడ్డుమీద కీడుస్తున్న వైనాన్ని బహిరంగ సభకు ముఖ్య ఉపన్యాసకురాలిగా హాజరైన వేముల రాధిక సభికుల దృష్టికి తెచ్చారు. దళితులు, మైనారిటీలు, మహిళలపై దాడి చేస్తున్న బిజెపిని ఎదుర్కొనేందుకు లాల్-నీల్ జెండాలు కలిసి పోరు సాగించాలని పిలుపు నివ్వటం సభకు హాజరైన ప్రజలకు, ప్రతినిధులకు స్ఫూర్తినిచ్చింది. ఆహ్వాన సంఘం అధ్యక్షులు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డును నిరసనగా తిరిగి ఇచ్చేసిన రాజీవ్ జోషి సభికులకు ఆహ్వానం పలికారు.

**దేశభక్తి హేతుబద్ధత:-**

మహాసభలను ప్రారంభించిన ముక్తా దభోల్కర్ తాము చేస్తున్న పోరాటాలు, ఐద్వా కార్యాచరణ సన్నిహితంగా సాగుతున్న తీర్పును సభ దృష్టికి తెచ్చారు. మహిళలు రోజువారీగా తమకోసం, తమ అక్కచెల్లెళ్ల జీవనం కోసం సాగించే కార్యాచరణ మాత్రమే అసలైన దేశభక్తి అన్నారు. అంధ విశ్వాసాలను అంతమెందించి హేతు బద్ధతను పెంచాల్సిన ఆవశ్యకతను, తన సొంత అనుభవాలను వివరిస్తూ సభ దృష్టికి తెచ్చారు.

ఆర్.ఎస్.ఎస్ జాతీయవాదం, దేశభక్తి గురించి చేస్తున్న ప్రచారాన్ని, అందుకోసం అన్ని వేదికలను ఉపయోగించు కుంటున్న తీరును వివరించారు. ఆర్ఎస్ఎస్ చెప్పే జాతీయవాదం సమాజాన్ని, దేశాన్ని విచ్ఛిన్నం చేస్తుందన్నారు. దభోల్కర, పన్సారే, కల్బుర్గి హత్యలు మతోన్మాద శక్తులకు పెరిగిన తెంపరితనానికి నిదర్శనమన్నారు. కుల ఉన్మాదం, కుల పంచాయతీలిస్తున్న దుర్మార్గ తీర్పుల్లో దభోల్కర్ స్థాపించిన అంధ విశ్వాస నిర్మూలన సంస్థ చురుకైన పాత్ర నిర్వహిస్తుందని దేశ వ్యాపితంగా, మూఢ విశ్వాస వ్యతిరేక చట్టాన్ని తెచ్చేందుకు ఆందోళన సాగించాల్సిన అవసరముందన్నారు.

**మహిళల ప్రాతినిధ్యాన్ని తగ్గిస్తున్న స్థానిక సంస్థలపై మరియం థావలే, మంజీత్‌రాథ్, జగ్మతి నాయక త్వంలో చర్చలు నిర్వహించారు. జాతీయ వాదంపై సుభాషిణీ అలీ దాని పుట్టుక, పరిణామం, ప్రస్తుత పరిస్థితి, కర్తవ్యాలపై వివరించగా ఫలప్రదమైన చర్చలు జరిగాయి. మహిళల ఉపాధి, అసంఘటిత రంగంలో శ్రామిక మహిళన్న పత్రాన్ని అర్చనా ప్రసాద్, మధు గార్గేల నాయకత్వంలో చర్చించారు. "అక్రమరవాణా-వ్యభిచారం", "మద్యం-మత్తు పానీయాలు" "పర్యావరణం -మహిళల", "ఆస్థి, భూమి హక్కులు, మహిళలపై ఇషితా ముఖర్జీ, టిఎస్ సీమ, సుధా సుందరరామన్, కీర్తిసింగ్ ఆయా గ్రూపులలో చర్చించారు.**

**పోరాటమే మార్గం:-**

ఐద్వా ప్యాట్రన్, సీనియర్ నాయకులు బృందాకరత్ ప్రసంగిస్తూ మనువాద, సంస్కరణవాద రాజ్యం తీరును, ఐద్వా పోరాట పాత్రను సభ దృష్టికి తెచ్చారు. పేరుకు మాత్రమే బిజెపి ప్రభుత్వమని, ఇది ఆర్ఎస్ఎస్ నడిపిస్తున్న ప్రభుత్వమని, రాజ్యాంగం మీద ఏ మాత్రం గౌరవం లేని ప్రభుత్వమన్నారు. ప్రధాని ఆర్ఎస్ఎస్ ప్రచారక్ అని, చట్టాలను నిరంతరం నీరు గార్చటం మాత్రమే కాక మహిళల హక్కుల మీద దాడి చేస్తున్నారన్నారు. 'మేము జాతి వ్యతిరేకులం, దేశద్రోహులం. సత్యాలను వెలికితీస్తాం. వాటికోసం పనిచేస్తాం' అని ఐద్వా ఈరోజు నినదిస్తుందన్నారు. 'త్రిపుల్ తలాక్‌ను వివక్షాపూరితంగా ఆచరించడాన్ని మనం వ్యతిరేకిస్తాం. దీనికోసం పోరాడు తున్న ముస్లిం మహిళలతో భుజం కలిపి నిలబడ్డాం. ముస్లిం లాబోర్డు ఈవిషయంలో సరిగ్గా లేదు.

హిందూ చట్టాలను అందరి మీదా రుద్దేందుకు ఉమ్మడి పౌరస్మృతి పేరిట బిజెపి ప్రయత్నిస్తున్నది. ఈ నేపథ్యంలో మనం ప్రస్తుతం ఉమ్మడి పౌరస్మృతిని వ్యతిరే కిస్తున్నాం' అని పేర్కొన్నారు. నోట్ల రద్దు, మేక్ ఇన్ ఇండియా నినాదాలు ప్రజలను బలి చేయడానికి మాత్రమే ఉద్దేశించ బడ్డాయి. గుజరాత్ అభివృద్ధి "భ్రమలు, అబద్ధాలని" వెల్లడవుతోంది. పేదరికం మోడీ విధానాలతో పెరుగు తోంది. కరువు, నీటి కొరతతో ప్రజల బాధలు తీరేవిగా లేవు. మతోన్మాదం మీద పోరాటం పేదల సమస్యలతో జోడించి ఎదుర్కోవాలి. మహిళలు పడుతున్న వేదన మన సంఘ కృషిలో భాగం కావాలి. బెంగాల్, ఛత్తీస్‌ఘడ్ తదితర చోట్ల అణచివేత సాగుతోంది. ప్రొఫెసర్ అర్చనాప్రసాద్, నందితల మీద అక్రమ కేసులు పెట్టి జైలులో తోసే యత్నం చేశారు. పెట్టుబడిదారులు ప్రజలకు బహుమతిగా ఇచ్చిన సామ్రాజ్య వాదం ప్రజలెదు ర్కొంటున్న ఒక భయంకర శత్రువు. స్త్రీల విముక్తి అనేది ఓ కల కాదు. అక్టోబరు విప్లవం మహిళల కలలను నిజం చేసింది. మనది కష్టతరమైన మార్గం. అయినా ఇదొక్కటే మార్గమంటూ ప్రారంభ సభలో బృందా ముఖ్యోపన్యాసం చేశారు.

**విస్తృత ప్రాతినిధ్యం:-**

డిసెంబరు 10 నుంచి 14 వరకు జరిగిన అఖిల భారత మహాసభలు దేశం నలుమూలల నుంచి హాజరైన ప్రతినిధులకు ఉత్తేజాన్నివ్వడమే గాక మార్గనిర్దేశం చేశాయి. ప్రజాతంత్ర ఉ ద్యమం, మహిళా సంఘం బలహీనంగా ఉన్న మధ్యప్రదేశ్‌లో మహా సభలు జరగడం ఓ సవాల్‌ను ఎదుర్కో వటమే. బిజెపి ప్రభుత్వం మహాసభల నిర్వహణకు అనేక ఆటంకాలు కల్పించింది. ప్రదర్శనకు అనుమతి నిరాకరించింది. ప్రతినిధులపై నిఘా వేసింది. అయినా ఆటం కాలను అధిగమించి సభలు జరిగాయి. ఐద్వా మహాసభలను జయప్రదం చేయటంలో ఐద్వా కమిటీతో పాటు భారత జ్ఞాన విజ్ఞాన సమితి, సిఐటియు కీలకపాత్ర పోషించాయి. 23 రాష్ట్రాల నుంచి హాజరైన 788 మంది ప్రతినిధులు, ప్రత్యేక ఆహ్వానితులు పాల్గొన్న సభలో 50 మందికి పైగా చర్చలలో పాల్గొన్నారు. ఐదు అంశాలు ప్రతినిధుల చర్చల్లో ముఖ్యంగా చోటుచేసుకున్నాయి.

1.మన దేశంలోనూ, ప్రపంచ వ్యాప్తంగానూ మరీ ముఖ్యంగా మన పొరుగు దేశాలలో పెరుగుతున్న హింస, అత్యా చారాల నేపథ్యంలో ఒక ఉమ్మడి వేదికకు చొరవ తీసుకోవాలని, 2. మహిళలపై సాగుతున్న కుల,మత దాడులు, బాధిత మహిళలకు ఐద్వా అండగా నిలబడుతున్న తీరు, మూఢ విశ్వాసాలు, కుహనా జాతీయవాదం,

మితవాద సంస్కరణలపై పోరాటాలు, 3. శ్రామిక మహిళలు, పట్టణ పేదలు రోజువారీ ఎదుర్కొంటున్న సవాళ్ళు 4. భూ సేకరణ, సహజ వనరుల కబ్జా, 5. పోలీసుల, రాజకీయ ఉన్మాద శక్తుల దాడులు, నిర్బంధం. 12, 13 తేదీల్లో రెండు రోజుల పాటు జరిగిన చర్చలలో నాలుగు నివేదికలను సభ ఆమోదించింది.

**ప్రస్తుత సమస్యలు కమీషన్లు:-**

ఏడు కమీషన్ పేపర్లను ఈ సభల్లో చర్చించారు. మహిళల ప్రాతినిధ్యాన్ని తగ్గిస్తున్న స్థానిక సంస్థలపై మరియం థావలే, మంజీత్‌రాథ్, జగ్మతి నాయకత్వంలో చర్చలు నిర్వహించారు. జాతీయ వాదంపై సుభాషిణీ అలీ దాని పుట్టుక, పరిణామం, ప్రస్తుత పరిస్థితి, కర్తవ్యాలపై వివరించగా ఫలప్రదమైన చర్చలు జరిగాయి. మహిళల ఉపాధి, అసంఘటిత రంగంలో శ్రామిక మహిళన్న పత్రాన్ని అర్చనా ప్రసాద్, మధు గార్గేల నాయకత్వంలో చర్చించారు. "అక్రమ రవాణా -వ్యభిచారం", "మద్యం-మత్తు పానీయాలు" "పర్యావరణం -మహిళల", "ఆస్థి, భూమి హక్కులు, మహిళలపై ఇషితా ముఖర్జీ, టిఎస్ సీమ, సుధా సుందరరామన్, కీర్తిసింగ్ ఆయా గ్రూపులలో చర్చించారు. ఆయా అంశాలపై స్పష్టమైన వివరాలు, దేశ వ్యాపిత అనుభవాలు, కార్యాచరణకు అవసరమైన మార్గాన్ని నిర్దేశించాయి. ముఖ్యమైన పది తీర్మానాలపై మహాసభ చర్చించింది. ఆధునిక సమాజంలో అక్టోబరు మహా విప్లవం మహిళల సమాన హక్కుల అగ్రగామిగా ముందు నడిచిన నేపథ్యంలో శతవార్షికోత్సవాలు నిర్వహించాలని నిర్ణయించటమైనది. ట్రిపుల్ తలాక్, గౌరవ హత్యలు, నోట్ల రద్దు, కనీస సదుపాయాలు, శాస్త్రీయ దృక్పథం-ఛాందన వాదం, మాతృత్వహక్కుల పరిరక్షణ, నిర్బంధంపై తీర్మానాలు చేసింది.

**"అక్రమరవాణా-వ్యభిచారం", "మద్యం-మత్తు పానీయాలు" "పర్యావరణం -మహిళల", "ఆస్థి, భూమి హక్కులు, మహిళలపై ఇషితా ముఖర్జీ, టిఎస్ సీమ, సుధా సుందరరామన్, కీర్తిసింగ్ ఆయా గ్రూపులలో చర్చించారు. ఆయా అంశాలపై స్పష్టమైన వివరాలు, దేశ వ్యాపిత అనుభవాలు, కార్యాచరణకు అవసరమైన మార్గాన్ని నిర్దేశించాయి. ముఖ్యమైన పది తీర్మానాలపై మహాసభ చర్చించింది.**

బిజెపి మతోన్మాదానికి బలైన వేముల రోహిత్ తల్లి రాధిక, బెంగాల్ తృణమూల్ అరాచకాలను ఎదిరించి నిలబడిన దేవశ్రీ సేనాపతి, సమాన ఆస్తి హక్కు కోసం పోరాడిన సంతోష్, కాలుష్యాన్ని వ్యతిరేకించి నందుకు జైలుపాలైన సత్యవతి, గ్యాంగ్‌రేప్‌కు గురై ఐద్వా అండతో విజయం సాధించిన బాధితులను సభ ఘనంగా సన్మానించింది.

**కళారూపాలు:-**

భోపాల్ సాంస్కృతిక వారసత్వాన్ని, భిన్న పోరాటాలను ఆలపించిన నవ్య థియేటర్ నిర్వాహకులు నాగిన్ తన్వీర్ గానాన్ని ప్రతినిధులు పదం,గళం కలిపి ఆస్వాదించారు. కవయిత్రుల సమ్మేళనం ఐద్వా ఆశయాలకు అండగా సాగింది. బిజివియన్, కన్నూర్ కళాకారుల నాటికలు, నృత్య రూపకాలు సమకాలీన స్థితిపై ధిక్కరణను అద్భుతంగా ఆవిష్కరించారు. మహారాష్ట్ర నుంచి "నేను సావిత్రీబాయి పూలే" ఏకాంకికలో నాలుగు పాత్రలను ఒక్కరే మెప్పించిన తీరు ఆశ్చర్యాన్ని కల్గించింది.

ఈ సందర్భంగా కర్ణాటకలో ఐద్వా ఉపాధి హామీపై సాగించిన పోరాట గాథలను "స్వేద ముత్యాలు" పేరుతో, తమిళనాడులో మహిళలపై సాగిన పరువు హత్యలపై ఐద్వా ప్రతిఘటనలపై పుస్తకాలు ఆవిష్కరించబడ్డాయి. 99 మంది సభ్యులు, 12 మంది ప్రత్యేక ఆహ్వానితులు, 32 మంది ఆఫీసు బేరర్లతో మహాసభ కమిటీని ఎన్నుకుంది. నూతన కార్యదర్శి మరియం థావలే మతోన్మాదాన్ని, ఆర్థిక సంస్కరణలను అంతమొందించేందుకు అన్ని శక్తులనూ కలుపుకొని ముందడుగు వేయాలని కర్తవ్యాలను నిర్దేశించారు. మేం అధిగమిస్తాం (we shall over come) అంటూ అన్ని భాషల్లో సభికుల గీతాలాపనతో సభ ముగిసింది.



వ్యాసం

# అంతరాన్ని గుర్తించండి, ఆలోచించండి

-ప్రియాంక చతుర్వేది, విదిశ మిశ్ర

మన దేశంలో మొట్టమొదటి సారిగా 2014 ఎన్నికలలో స్త్రీల భద్రత, సాధికారతకు సంబంధించిన విధానాలు రాజకీయ పార్టీల నేతలు, ప్రజలు ముఖ్యంగా ఓటర్లు చర్చిం చారు. రెండు సంవత్సరాల నుండి ప్రభుత్వ విధానాలను ప్రజలు పరిశీ లించడం పెరిగింది. ప్రతిస్పందించే వారి సంఖ్య కూడా పెరిగింది. 2015 లో పారిస్‌లో జరిగిన ప్రపంచ దేశాల సమ్మేళనంలో భారత దేశంతో సహా 194 దేశాలు నిలకడతో కూడిన అభివృద్ధి (సస్టెయినబుల్ డెవలప్ మెంట్)ని లక్ష్యంగా చేసుకున్నాయి. ప్రపంచాన్నిమార్చే 17లక్ష్యాల్లో 'లింగ సమానత' ఒక లక్ష్యంగా ఈ పారిస్ అగ్రిమెంటులో రాసుకున్నారు. దీనిని భారత దేశం కూడా అంగీకరించింది. పేదరికం తగ్గుదల, ఉత్పాదకత పెరగడం, వాతావరణం సానుకూ లంగా ఉండడం అనేవి స్త్రీల సాధికార తను పెంచుతాయని గ్రహించారు.

ఈ ప్రణాళికను ముందుకు తీసుకు వెళ్లడానికి వనరుల కొరత ప్రధాన అడ్డంకిగా ఉంది. అందువలన ప్రతీదేశంతోబాటు భారతదేశం కూడా తన బడ్జెటులో మహిళల అభివృద్ధి కోసం నిధులను కేటాయించాల్సుంది.

గత సంవత్సరం ప్రపంచ ఆర్థిక ఫోరమ్ తన సంవత్సరాంత రిపోర్టులో (గ్లోబల్ జెండర్ గ్యాప్ రిపోర్ట్) ఇండియా 87వ స్థానంలో ఉందని తెలిపింది. ఈ సంస్థ ఆర్థిక, విద్య, ఆరోగ్యం, రాజకీయ ప్రాతినిధ్యం అనే అంశాల్లో స్త్రీల అభివృద్ధిని అధ్యయ నం చేసింది. స్త్రీలకు పూర్తిగా పని లభించకపోవడం, చట్ట సభల్లో ప్రాతి నిధ్యం లేకపోవడం, బాల బాలికల నిష్పత్తిలో తేడా, పెరుగుతున్న హింస ప్రధాన సమస్యలుగా ఉన్నాయి.

ఈ అంతరాలను తగ్గించడానికి

**ప్రపంచ ఆర్థిక ఫోరమ్ తన సంవత్సరాంత రిపోర్టులో (గ్లోబల్ జెండర్ గ్యాప్ రిపోర్ట్) ఇండియా 87వ స్థానంలో ఉందని తెలిపింది. ఈ సంస్థ ఆర్థిక, విద్య, ఆరోగ్యం, రాజకీయ ప్రాతినిధ్యం అనే అంశాల్లో స్త్రీల అభివృద్ధిని అధ్యయ నం చేసింది. స్త్రీలకు పూర్తిగా పని లభించకపోవడం, చట్ట సభల్లో ప్రాతి నిధ్యం లేకపోవడం, బాల బాలికల నిష్పత్తిలో తేడా, పెరుగుతున్న హింస ప్రధాన సమస్యలుగా ఉన్నాయి.**

భారతదేశం జెండర్ రెస్పాన్సివ్ బడ్జెటింగ్ (జీఆర్‌బి)ని 2005లో ప్రవేశపెట్టింది. అప్పటి వరకు ఉన్న బడ్జెట్ జెండర్ న్యూట్రల్‌గా ఉండడం వల్ల ప్రత్యేకించి స్త్రీలను పరిగణలోకి తీసుకుని అసమానతలను తగ్గించడానికి ఈ జి.ఆర్.బి ఉద్దేశించ బడింది.

2005 నుంచి ప్రతి బడ్జెట్‌లో రెండు భాగాలు. ఒకటి ప్రత్యేకంగా స్త్రీలకు సంబంధించిన స్కీములతో కూడినది. అంటే 100% నిధులు స్త్రీలకు కేటాయిస్తారు. ఇక రెండోది. 'ప్రో ఉమన్ స్కీములు' అంటే దీనిలో 30% నిధులు (స్కీంలు) స్త్రీలకు కేటాయిస్తారు. దీనిని కేంద్ర ఆర్థిక శాఖ అమలు చేస్తోంది. రాష్ట్రాల పరిధిలో 16 రాష్ట్రాలు దీనిని అమలు పరుస్తున్నాయి. ఈ జి.ఆర్.బి వలన 'స్త్రీల అభివృద్ధి' సూచికలో కొంత పెరుగుదల కనిపించిందని ఐ.ఎం. ఎఫ్ అధ్యయనం తెలిపింది. జి.ఆర్.బి అమలు చేస్తున్న రాష్ట్రాల్లో పాఠశా లలో బాలికల నమోదు శాతం పెరిగింది. కొంత అభివృద్ధి కనిపించి నప్పటికీ సక్రమమైన ప్రణాళిక, ఆచరణాత్మక విధి విధానాలు లేనందువల్ల ముఖ్యంగా మారుమూల గ్రామాల్లోని మహిళలకు ఈ ఫలం అందడంలేదు. ఈ మధ్య వనరుల కేటాయింపు కూడా తగ్గింది. స్త్రీ శిశు సంక్షేమ శాఖ, జాతీయ మహిళా కమీషన్ చెప్పిన దాన్ని బట్టి చూస్తే 'గృహ హింస నివారణా చట్టం' అమ లుకు ఎటువంటి ఫండ్స్ కేటాయింపు లేదు. జి.ఆర్.బి పరిధి లోకి వచ్చే మంత్రిత్వ శాఖలు కూడా తగ్గాయి. ఫండ్స్ కూడా వికేంద్రీ కరించి రాష్ట్రా లకు కేటాయించారు. దీని వలన రాష్ట్రాలు మహిళలకు పరిమితంగానే నిధులు

కేటాయించ వలసి వస్తోంది. అందువల్ల వాస్త వంగా ఈ కార్య క్రమం సరిగా అమలు జరగడంలేదు.

సమాజంలో స్త్రీ పురుష అసమానతలు పోగొట్టడానికి ఉపకరించే ఈ జి.ఆర్.బి (జెండర్ రెస్పాన్సివ్ బడ్జెటింగ్) మహిళా ప్రాతినిధ్యం పెరిగేందుకు దోహదపడే కార్యక్రమాలపై కేంద్రీకరిస్తుంది. అయితే సరైన సహకారం, ప్రభుత్వ విధానాలు, పట్టాణాభివృద్ధి, ఆహార భద్రత, మంచినీటి సరఫరా, పారిశుధ్యం అనేవి ఈ జి.ఆర్.బి కి సహకరిస్తే మహిళల అభివృద్ధి సాధ్యం. ఈ రంగాల్లో చేసే ప్రభుత్వ విధానాలు స్త్రీలపైన, పురుషుల పైన కూడా ప్రభావాన్ని చూపుతాయి. కనుక ఈ రంగాల్లో అభివృద్ధికర విధానాలు ఉండాలి.

అదే విధంగా మహిళలు కూడా కేవలం లబ్ధిదారులుగా కాకుండా ఉత్సాహంగా ఈ కార్యక్రమాలు సక్ర మంగా అమలు జరపడంలో మమేకం అవ్వాలి. మంత్రిత్వ శాఖలు ముఖ్యంగా ఆర్థిక శాఖ బడ్జెట్ ప్రవేశ పెట్టబోయే ముందు జరిగే చర్చలో మహిళలు తమ గురించి తాము గొంతు వినిపించే బడ్జెట్ వేదికలపై మహిళా ఉద్యమకారులకు అవకాశం కల్పించాలి.

ఈ జెండర్ బడ్జెట్ అనేదే తరతరాలుగా పాతుకుపోయిన అసమానతలను పోగొట్టలేదు. కానీ విశాల దృక్పథంతో కూడిన మంచి ప్లానింగ్, లక్ష్యాలు కలిగిన, తగిన బడ్జెట్ కేటాయింపులు, పర్యవేక్షణ, మదింపు అనేవి సక్రమంగా అమలు పరిస్తే స్త్రీల అభివృద్ధి, సాధికారత మెరుగుపరచవచ్చు. విధానాలు ఫీడ్ బ్యాక్ లేకపోతే ఫెయిల్ అవుతాయి.

**మన ముందున్న లక్ష్యాలు:-** కేంద్ర ప్రభుత్వం తను జి.ఆర్.బి. కి కేటాయింపులు ఇస్తూ రాష్ట్ర ప్రభు త్వాలు ఇచ్చేలా ప్రోత్సహించాలి. ఈ ఫిబ్రవరిలో కేంద్ర బడ్జెట్ ప్రవేశపెట్టే ముందు జరిగే చర్చల్లో ప్రస్తుత వాస్త వాలను, అనుభవాలను పరిగణనలోకి తీసుకోవాలి. లింగఅసమానతపై వాదోపవాదాలు లేకుండా కేటా యింపులు జరగాలి.

అనువాదం-నందూరి రూపవాణి

## అమ్మా! వందనం!

అమ్మా! వందనం!
కాబోయే అమ్మా! అభినందనం!
అమ్మలోని కమ్మదనపు ఆరాటం,
మన కడుపు నింపు పోరాటం.
తల్లిపాలు తాగి, తాతలు మాటలు ఎరిగి,
అవనిలో ఆ తల్లుల బాధలు తీర్చే తనయలై
అందుకోండి అందరి ఆదరాలు.
అమ్మపాలు తాగి, ఆ తనయులు
అతివల బాధల నెరిగి, అందరికి ఆరాధ్యులు
కండి!
అమ్మలేని నాడు అవని అంధకారం,
అమ్మ అనే ఆ కమ్మని పిలుపే ఆమెకు
మణిహారం.

అమ్మకు కావాలి కమ్మని భారతావని
అమ్మ బాధ నెరిగి
ఆలయాలలో నేలపాలు చేసే ఆ పాలు
అల్లాడే పాపలకి అందివ్వు.
అమ్మాయి కదా అని అవతల పారేస్తే
ఆమే రేపు నీకు ఆలంబన కావచ్చు
అమ్మ పాలు అమృతం అన్నారు
ఆనాడు
ఆ అమృతమే విషం చేసారు ఈనాడు
అమ్మ అంటే అంతులేని ప్రేమ.
ఆ ప్రేమతో జయిద్దాం మన కలలు.

- కె. శుభ

# శ్రామిక మహిళా ఉద్యమ నిర్మాత క్లారా జెట్కిన్

మణిపూసలు

-కె. స్వరూపరాణి

అంతర్జాతీయ శ్రామిక మహిళా ఉద్యమ నిర్మాతల్లో ఒకరైన క్లారా జెట్కిన్ సోషలిజానికి, మహిళా ఉద్యమానికి చేసిన సేవలు నిరుపమానమైనవి. మార్చి-8 అంతర్జాతీయ మహిళా ఉద్యమానికి రూపకల్పన చేసిన శిల్పులలో ఆమె ఒకరు.

"సోషలిస్టు సమాజంలో మాత్రమే కార్మిక మహిళల పూర్తి విముక్తి సాధ్యమవుతుంది." అని తుదకంటా ఆశయం కోసం తన జీవితాన్ని ధారపోసిన వీరవనిత క్లారా జెట్కిన్. 1957, జులై 15వ తేదీన జర్మనీలోని వైడిరో అనే గ్రామంలో క్లారా జన్మించారు. ఆమె తల్లిదండ్రులు ఫ్రెంచి విప్లవ సిద్ధాంతాల పట్ల గట్టి నమ్మకం గలవారు.

ఆమె పదిహేడవ యేట లీప్జిగ్ మహిళా ఉపాధ్యాయ కళాశాలలలో ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చే కళాశాలలో చేరింది. కళాశాలలో సోషలిస్టు విద్యార్థి బృందాలతో పరిచయమై మార్క్సిజంలో తొలి అక్షరాలు నేర్చింది. 1870 నుండి జర్మన్ సోషలిస్టు ఉద్యమాలలో క్లారా చురుకుగా పాల్గొన్నారు. ప్రభుత్వానికి వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొంటున్నారని ఉపాధ్యాయుడుగా వున్న క్లారా భర్తను జర్మన్ ప్రభుత్వం జర్మనీ నుండి బహిష్కరించింది. క్లారా జెట్కిన్ దంపతులకు రాజకీయ వలస ప్రారంభమైంది.

స్విట్జర్లాండ్‌లోవున్నప్పుడు జ్యూరిచ్ నుండి వెలువడుతున్న నిషిద్ధ పత్రిక "డేర్ సోజియార్ డెమొక్రటిక్‌కు సంపాదకత్వ



బాధ్యతలు చేపట్టారు. 1889లో పారిస్‌లో నిర్వహించిన రెండవ ఇంటర్‌నేషనల్ సంస్థాపక మహాసభ నిర్వాహకులలో క్లారా ఒకరు. సోషలిజం కోసం సాగే విప్లవ పోరాటంలో మహిళల పాత్ర గురించి ప్రసంగిస్తూ కార్మిక మహిళా ఉద్యమానికి ఒక కార్యక్రమాన్ని రూపొందించవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పారు,. అంతర్జాతీయ వేదికపై స్త్రీ పురుష సమానత్వాన్ని ఒక మహిళ ఎలుగెత్తి చాటడం ఇదే మొదటిసారి. స్త్రీలకు సంబంధించి రెండవ ఇంటర్నేషనల్ ఆమోదించిన తీర్మానం ఫలితంగా ఆర్థిక, రాజకీయ, చట్టబద్ధ విషయాలలో స్త్రీలకు పురుషులతో పాటు సమానత్వం వుండాలని 1890 నాటి సోషల్ డెమొక్రటిక్ పార్టీ కార్యక్రమం డిమాండ్ చేయగల్గింది.

భర్త మరణంతో క్లారా 1890లో జర్మనీకి తిరిగి వచ్చి సోషల్ డెమొక్రటిక్ పార్టీకి చెందిన మహిళా ఉద్యమానికి ఆమె నాయకత్వం చేపట్టింది. జర్మనీ శ్రామిక మహిళల పత్రిక కె. ఢైగ్లై చెటే (సమానత్వం)కు 1892 నుండి సంపాదకురాలిగా వున్నారు. కార్మికుల సమ్మెలు, ఇతర కార్యకలాపాల గురించి పత్రికలో ప్రచురించేవారు. తమ వర్గ ప్రయోజనాలను గుర్తించేలా కార్మిక వర్గ స్త్రీలను చైతన్యపరచటం, తన ప్రాథమిక కర్తవ్యంగా క్లారా భావించారు. ఆమె చేసిన కృషి ఫలితంగా జర్మన్ కార్మిక మహిళా ఉద్యమం మొత్తం కార్మికోద్యమంలో అంతర్భాగంగా ఎదిగింది. 1949 నాటికి డైగ్లై చెటే పత్రిక సర్క్యులేషన్ 1,25,000 కాపీలకు పెరగడం సాధారణ విషయం కాదు.

క్లారా జెట్కిన్ అనేక కార్మిక సంఘాల కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనేవారు. ఒక బైండర్స్ యూనియన్, గార్మెంట్ వర్కర్స్, ఉడ్ వర్కర్స్ తదితర యూనియన్లలో క్రియాశీలకంగా పనిచేశారు. 1896లో సోషల్ డెమొక్రటిక్ పార్టీ మహా సభలో క్లారా జెట్కిన్ ప్రసంగిస్తూ "వర్గాలుగా విభజితమైన సమాజంలో సాధారణ మహిళా ఉద్యమం ఉండదు. బూర్జువా సమాజంలో సాధారణ మహిళా ఉద్యమం ఉండదు. బూర్జువా మరియు శ్రామిక మహిళా ఉద్యమాలే ఉంటాయి. శ్రామిక వర్గానికి చెందిన మహిళ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందగల్గింది. కాని ఒక మనిషిగా, భార్యగా, నిండైన వ్యక్తిత్వంతో జీవించే అవకాశాన్ని పొందలేకపోయింది. భార్యగా, తల్లిగా, తను

చేసే చాకిరీకి గాను ఒక స్త్రీ, పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థ విదిలించే మెతుకులను మాత్రమే పొందగల్గుతున్నది. ఆ కారణంగా కార్మిక మహిళల విముక్తి పోరాటమనేది తన వర్గానికి చెందిన పురుషులకు వ్యతిరేకంగా సాగేది మాత్రం కాదు ఆమె సాగించే పోరాటం కార్మిక వర్గ రాజకీయ పాలననున స్థాపించడం. తన వర్గానికి చెందిన మగవారితో భుజం భుజం కలిపిన కార్మిక మహిళలు పెట్టుబడిదారీ దోపిడీ పాలనకు చరమగీతం పాడి సోషలిస్టు సమాజాన్ని నిర్మిస్తారు. అపుడు మాత్రమే స్త్రీ విమోచన సాధ్యమవుతుందని" ఉత్తేజకర ఉద్బోధ చేశారు. ప్రతి రెండేళ్ళకొకసారి జర్మన్ డెమోక్రటిక్ పార్టీ మహాసభలతో పాటు మహిళా సదస్సులు కూడా జరిగేలా 1990నుంచి కృషి చేశారు. క్లారా చొరవతో 1907లో స్టట్ గార్డ్‌లో 15 దేశాలకు చెందిన 59మంది మహిళలతో మొట్ట మొదటి అంతర్జాతీయ సోషలిస్టు మహిళా మహాసభ జరిగింది. స్త్రీలకు సార్వత్రిక ఓటు హక్కును కల్పించేటందుకు అన్ని దేశాలలోనూ సోషలిస్టులు శక్తి వంచన లేకుండా కృషి చేయాలని పిలుపునిచ్చారు. 1910లో కోపెన్‌హెగన్‌లో జరిగిన రెండవ అంతర్జాతీయ మహా సభ సార్వత్రిక ఓటు హక్కును పునరుద్ఘాటించటంతోపాటు మార్చి 8వ తేదీన అంతర్జాతీయ మహిళా దినంగా పాటించాలంటూ తీర్మానాన్ని ఆమోదించింది.

1920లో క్లారా జెట్కిన్ కమ్యునిస్టు పార్టీ టిక్కెట్‌పై జర్మనీ పార్లమెంట్‌కు (రీచ్‌స్టాగ్)కు ఎన్నికయ్యారు. 1920 నుండి 1933వరకు పార్లమెంటు సభ్యురాలిగా అనంతమైన సేవలందించారు. 1932లో ఆమెను చంపుతామని నాజీలు బెదిరింపులను లెక్కచేయకుండా సీనియర్ పార్లమెంటేరియన్‌గా ఆగస్టు 30న జర్మనీ పార్లమెంట్ సమావేశాలను ప్రారంభించి తన ధైర్యసాహసాలను అంకిత భావాలను చాటుకున్నారు. ఆనాటి ప్రసంగంలో ఆమె ఫాసిజాన్ని గట్టిగా వ్యతిరేకించారు. "అత్యంత పాశవికమైన గుత్త పెట్టుబడి దారీ పాలనను మట్టుపెట్టేందుకు కార్మికులందరి ఐక్య సంఘటన అవసరం" అని నొక్కి చెప్పారు.

జర్మనీలో నాజీల విజృంభణతో జెట్కిన్ తన జీవితపు ఆఖరి దశలో రష్యాలో ఆశ్రయం పొందారు. లెనిన్‌తో విస్తృతంగా ఇతర అంశాలతోపాటు మహిళా సమస్యలపై లోతైన చర్చలు చేశారు. "నేను షోషలిస్టు జర్మనీని చూసేందుకే బ్రతికి వున్నాను" అని చెబుతూ వచ్చిన జెట్కిన్ తను జీవించి వుండగా ఒక సోషలిస్టు దేశంలోనే 1933 జూన్ 20న తుది శ్వాస విడిచారు. మాస్కోలోని రెడ్‌స్క్వేర్‌లో జరిగిన ఆమె అంత్యక్రియలకు దాదాపు 6లక్షల మంది హాజరయ్యారు. క్రిమ్లిన్‌లో లెనిన్ తదితర విప్లవ నాయకుల సమాధుల ప్రక్కనే క్లారాజెట్కిన్ సమాధిని నిర్మించారు.



# తీరం చేరాలంటే...!

పెదాల పూవనంపై
లాస్యమాడే ముగ్ధత్వం
కలుక్కున గుచ్చే ముల్లునీ కసిదీరా
తీయలేని స్నిగ్ధత్వం
ఏ గూటి పక్షో...

కోయిల గానం
ఐనా... ఆశల రెక్కలు
ఆకాశమంతా పరచుకుంటాయ్
స్వభావాలు... స్వలాభాలు

నేల అంచుల్లోకి నిక్షిప్తమౌతూ
పరివ్యాప్తమౌతూ
సాపేక్షత నుండి ఆపేక్షతవైపు
అడుగులిడుతూనే వుంటాయ్

గుంపులో ఆర్భాటపు చేరిక
వివాహమొక బంగరు పంజరం
ఎడారి రాగంతో
గుండె గొంతుకలో తడారిపోయే

ఏవేవో అదృశ్యపు అలజడులు
జడివాన రూపు దాలుస్తాయ్
తడిచి ముద్దైతేనేం...?
తీరం చేరాలంటే
తెరచాప నువ్వై సాగాలి...!

- ఇల్ల. ప్రసన్నలక్ష్మి

మరో అమ్మ

సీరియల్

# మహిళలు కోల్‌డేల్ బూజుని దులిపిన వైనం



మేరీలాండ్‌లోని లోనకోనియాలో సమ్మె జరిగింది. నేను అక్కడే ఉన్నా. పెన్సిల్వేనియాలోని హజెల్టన్ బొగ్గుగనిలో సమ్మె విషయం చర్చించడం కోసం సదస్సు జరిగింది. వాళ్లు సమ్మెకి పిలుపునిచ్చినపుడు నేను అక్కడే ఉన్నా. స్క్రాన్‌టన్, షమోకిన్, కోల్‌డేల్,పాంథర్ క్రీక్, ప్యాలీ బ్యాటిల్ నుండి లక్షా 50వేల మంది గని కార్మికులు ఈ సమ్మె పిలుపును అందుకున్నారు.

షమోకిన్‌లో మిల్స్ డాహర్‌టీ అనే నాయకుడ్ని కలిశాను. అతను పని మానేశాడు. అతనికి యూనియన్ ఇచ్చే అలవెన్స్‌లో డబ్బును భార్యకు ఇచ్చేవాడు. మిగిలిన సగం డబ్బును యూనియన్ మీటింగు హాల్ కిరాయికి, లైట్ల కోసం ఖర్చు పెట్టేవాడు. నాయకులు ఆరోజుల్లో ఎక్కువ అలవెన్స్ తీసుకునే వారు కాదు. వాళ్లు వీరోచితంగా, నిస్వార్ధంగా పనిచేసేవారు.

నేను షమోకిన్‌కు దగ్గరలో ఉన్న ఒక పర్వత ప్రాంతపు టౌన్‌కి వెళ్లినపుడు, అప్పటికే ఒక చర్చిలో మతబోధకుడి మీటింగ్ జరుగుతోంది. నా మీటింగ్ బహిరంగ స్థలంలో జరుగుతోంది. ఆ మత బోధకుడు కార్మికులు పనిలోకి తిరిగి వెళ్లాలని, యజమానులకు తలొగ్గాలని, అలా చేస్తే స్వర్గంలో తగిన ప్రతిఫలం దొరుకుతుందని ఉద్బోధిస్తున్నాడు. కార్మికులు అజ్ఞానంలో ఉన్నారని విమర్శించాడు. కార్మికులు ఆ చర్చి మీటింగును వదిలి నా మీటింగుకు వచ్చారు.

అబ్బాయిలూ మీరు చనిపోయేముందు మీకు, మీ భార్యలకు, పిల్లలకు కొంచెమైనా స్వర్గాన్ని చూపించటం కోసమే ఈ సమ్మె జరుగుతోందని చెప్పాను.

ఆ ప్రాంతంలోని కార్మికులందర్నీ సమీకరించాం. పోరాటం కొనసాగుతోంది. హజెల్టన్ జిల్లాలో ఉన్న కోల్‌డేల్‌లో గని కార్మికులను ఎక్కడా మీటింగ్ పెట్టుకోనివ్వడం లేదు. ఈ జిల్లాలో సమ్మె జరగాలంటే కోల్‌డేల్ కార్మికులను సమీకరించడం అవసరం.

ఇక్కడకు దగ్గరలో ఉన్న మెక్‌దూకు వెళ్లాను. కోల్‌డేల్ కార్మికులను సమ్మెలోకి తెచ్చేందుకు సహాయం చేయమని స్థానికంగా వున్న మహిళలను అడిగా. పిల్లలను చూసుకునేందుకు వాళ్ల భర్తలను ఇళ్ల దగ్గరే ఉంచమని చెప్పా. వాళ్లతో పాటు ఎప్రాన్‌లు, బూజుదులిపే కర్రలు, చీపుళ్లు, కొన్ని తగరపు పెనాలను పట్టుకు రమ్మన్నాను. తగరపు పెనాలనే వాయిద్యాలుగా మార్చి వాటిని గట్టిగా వాయిస్తూ కొండల మీదుగా 15మైళు నడిచాం. మేము తెల్లవారుజామున 3గంటలకు కోల్‌డేల్‌కు వెళ్లేప్పటికి రోడ్లపై మిలిటరీ గస్తీ తిరుగుతోంది. రెజిమెంట్ కల్నల్ మమ్మల్ని 'ఆగండి, వెనక్కి వెళ్లండి' అని ఆదేశించాడు.

'కల్నల్, అమెరికా కార్మికులు ఎప్పుడూ ఆగరు. ఎన్నటికీ వెనక్కి మళ్లరు. ముందుకు దూసుకుపోతార'ని జవాబిచ్చా.

'తుపాకీకి బిగించిన కత్తులకు పని చెప్పాల్సొస్తుంది' అని బెదిరించాడు.

'ఎవరి మీద' అని అడిగా. 'నీ ప్రజల మీద' అన్నాడు.

అందుకు నేను గట్టిగానే సమాధానం చెప్పా. 'మేము శత్రువులం కాము. చిన్న రొట్టెముక్క కోసం పోరాడుతున్న కార్మిక మహిళలం. మా పోరాటంలో కోల్‌డేల్ సోదరులు కూడా కలిసిరావాలని కోరుకుంటున్నాం. దేశం కోసం, మా పిల్లల కోసం ఈ రోడ్డుమీద పడ్డాం' అని అన్నా.

తెల్లవారే వరకు మమ్మల్ని అక్కడే రోడ్లపైనే ఉంచారు. వంటగదిలో వేసుకునే ఎప్రాన్స్‌తో ఉన్న మహిళలను, మా చీపుళ్లను, బూజుకర్రలను చూసి

నవ్వుకున్నారు, మా మహిళా సైన్యాన్ని వదిలిపెట్టారు. ఈ గని కార్మికుల మహిళా సైన్యం అద్భుతమైన ఘనకార్యాన్ని సాధించబోతోంది.

సరే, కోల్‌డేల్ క్యాంపులో గని కార్మికులు పనిలోకి వెళుతూ మెక్‌డూ మహిళలను కలిశారు. అప్పుడు ఈ మహిళలు అట్లపెనాలపై గట్టిగా కొడుతూ "యూనియన్‌లో చేరండి, యూనియన్‌లో చేరండి" అంటూ అరవడం మొదలు పెట్టారు. అందరూ యూనియన్‌లో చేరారు. స్ట్రీట్ కార్ కార్మికులను కూడా యూనియన్‌లో చేర్చాం. వీళ్లు గనుల్లోకి వెళ్లే ఏ స్కాబ్స్‌నైనా ఈడ్చిపారేస్తామని హామీ ఇచ్చారు. ఇక మాకు ఇక్కడ ఏం పని లేకపోయింది. మేము తిరిగి మా ఇళ్లకు కొండల మీదుగా అట్లపెనాలను వాయిస్తూ, దేశభక్తి గీతాలు పాడుకుంటూ వెళ్లాము.

ఈలోగా హజెల్‌టన్‌లోని వ్యాలీ హోటల్‌లో ప్రెసిడెంట్ మిట్చెల్ తదితర నాయకులు బస చేసి ఉన్నారు. కోల్‌డేల్‌కు మేము జరిపిన మార్చ్ గురించి విలేకరులు అతనికి ఫోన్ చేసి "మదర్ జోన్స్ ఈ కొండల్లో కొంతమంది అడవి మనుషుల్లాంటి ఆడవాళ్లతో కలిసి నరకం సృష్టిస్తోందని" చెప్పారు.

అది వినే అతను వణికిపోయాడు. మేము గని యజమానులను ఎలా తరిమికొట్టామో, వాళ్ల భార్యలకు తమ భర్తలను మంచి అమెరికా పౌరులుగా

**అందుకు నేను గట్టిగానే సమాధానం చెప్పా. 'మేము శత్రువులం కాము. చిన్న రొట్టెముక్క కోసం పోరాడుతున్న కార్మిక మహిళలం. మా పోరాటంలో కోల్‌డేల్ సోదరులు కూడా కలిసిరావాలని కోరుకుంటున్నాం. దేశం కోసం, మా పిల్లల కోసం ఈ రోడ్డుమీద పడ్డాం' అని అన్నా.**

**తెల్లవారే వరకు మమ్మల్ని అక్కడే రోడ్లపైనే ఉంచారు. వంటగదిలో వేసుకునే ఎప్రాన్స్‌తో ఉన్న మహిళలను, మా చీపుళ్లను, బూజుకర్రలను చూసి నవ్వుకున్నారు. మా మహిళా సైన్యాన్ని వదిలిపెట్టారు. ఈ గని కార్మికుల మహిళా సైన్యం అద్భుతమైన ఘనకార్యాన్ని సాధించబోతోంది.**

మార్చమని ఎలా హితవు చెప్పామో తెలిస్తే ఇంకెంత బెదిరిపోయేవాడో! మిలిటరీ వున్న ఇంటి వంటగదిలోకి ఎలా వెళ్లామో, అక్కడ సైనికుల కోసం వుంచిన అల్పాహారాన్ని ఎలా ఆరగించామోనన్న విషయం తెలిస్తే ఇంకా గాబరా పడేవాడేమో.

నేను తిరిగి హజెల్‌టన్ వెళ్లాను. మిట్చెల్ నన్ను ఆశ్చర్యంగా చూశాడు. నేను పూర్తిగా అలసిపోయి వున్నాను. మొత్తం 30మైళ్ల ప్రయాణం. ఎవరి ఆస్తులు నాశనం కాలేదని, ఎవరికీ హాని జరగలేదని మిట్చెల్‌కు చెప్పాను. సైన్యం మానవతా దృక్పథంతో వ్యవహరించిందని మొత్తం వ్యవహారాన్ని వాళ్లు ఒక జోక్‌గా తీసుకున్నారని చెప్పాను. అక్కడ అధికారులు ఏవిధంగా భయపడ్డారో చెప్పాను. నేనెవరినో, ఏమిటో తెలుసుకోకుండానే పోలీస్ నాతో ఎలా మాట్లాడాడో మిట్చెల్‌కు వివరించి చెప్పాను.

"భగవంతుడా! మదర్ జోన్స్ నిజంగానే భయంకరమైన ఆడ మనిషి". అని ఆ అధికారి అన్నాడు.

అయితే నన్ను ఎందుకు అరెస్టు చేయడం లేదని నేను అడిగిన ప్రశ్నకు

భగవంతుడా! నేను అరెస్టు చేయలేను. ఆ ఆడవాళ్లు, వాళ్ల చీపుళ్లు, బూజుకర్రలతో నా వెంటపడతారు. వాళ్లకు సరిపడా జైళ్లు లేవు" అని ఆ అధికారి బెదురుతూ జవాబు చెప్పాడు.

ఓ దేవుడా! అమ్మా! మీరు ఇంటికి క్షేమంగా రాలేకపోతే, ఏం చేసేవారు అని మిట్చెల్ అడిగాడు.

'నా దగ్గర 5000 మంది కార్మికులున్నారని, వాళ్లంతా యూనియన్‌లో వున్నారని, వాళ్లే కాక స్ట్రీట్ కార్ కార్మికులు కూడా యూనియన్‌లో చేరారని, వాళ్లు ఏ స్కాబ్‌ని క్యాంప్‌లోపలికి రానివ్వలేదని ఆ పోలీసులకు చెప్పాను' అని అన్నాను.

'మీరు గాయపడ్డారా' అని మిట్చెల్ అడిగాడు. "లేదని, మేమే ఇతరుల పని పట్టామని" చెప్పాను.

నిజంగా ఇది గొప్ప పోరాటం.



వ్యాసం

# పురోగామి పథంలో

-బి. వేణు కుమారి

"తరాలు మారినా తలరాతలు మారవు. ఎల్లలు దాటిన మహిళలపై దోపిడి, హింస అణచిత అనేవి రూపం మారటం తప్ప మార్పు లేదు" అన్నది వాస్తవం, నాటి స్త్రీకి నేటి స్త్రీల జీవన శైలిలో ఎటువంటి మార్పు లేదు. స్త్రీ తన సంపాదనను ఖర్చు చేసే విషయంలో స్వేచ్ఛలేదు. ఇప్పటి సమాజం స్త్రీని ఒక సెక్స్ సింబల్‌గా, చులకన భావనతో తన పురుష కబంధ హస్తాలతో అణచివేయటానికి పురాణాలను అడ్డు పెట్టుకుని స్త్రీకి స్వేచ్ఛని దూరం చేస్తుంది.

రంగనాయకమ్మ ఇంటర్వ్యూ సంపాదకంలోని స్త్రీ స్వేచ్ఛ (27-9-1981).

ప్ర:- సంఘంలో స్త్రీకి ఇప్పుడున్న స్థానాన్ని మీరు ఏమని పరిగణిస్తారు?

జ:- స్త్రీకి వున్న స్థానం పురుషుడికి బానిసగా వుండడమే.

ప్ర:- బానిసగా అనే మాట ఒక పోలిక కోసం అట్లా అంటున్నారా?

జ:- పోలిక కోసం కాదు. నిజంగా వున్న పరిస్థితి బానిస పరిస్థితే. ఏవో కొన్ని విషయాలలో తేడాలు తప్ప. బానిసని ఫలానా యజమానికి చెందిన బానిసగా గుర్తించినట్టు, స్త్రీని ఫలానా ఆయన కూతురుగానో, ఫలానా ఆయన భార్యగానో మాత్రమే గుర్తిస్తారు. సంఘమూ, చట్టాలూ, స్త్రీని స్వతంత్ర వ్యక్తిగా గుర్తించడం లేదు.

బానిసల బతుకు యజమానుల దయా దాక్షిణ్యాల మీద ఆధారపడి వున్నట్టు, స్త్రీల బతుకు పురుషుల దయా దాక్షిణ్యాల మీద ఆధారపడి వుంటుంది. పురుషులంటే తండ్రీ, భర్త.

బానిసలకి స్వంత ఇంటిపేరుండదు. యజమానుల ద్వారానే ఇంటి పేర్లు వస్తాయి. స్త్రీలకీ అంతే. బానిసలకి స్వంత పిల్లల మీద హక్కు వుండదు. స్త్రీలకీ అంతే. బానిసలకి ఆస్తి వుండదు, స్త్రీలకీ అంతే. స్త్రీకి ఆస్తి వుంటే అది పురుషులు యివ్వడం వల్ల వచ్చే ఆస్తి.

బానిసల్ని యజమానులు కొట్టవచ్చును. అది తప్పు కాదు, నేరం కాదు. స్త్రీలనీ అంతే. భార్యని కొట్టడం తప్పుకాదు. "వాడి పెళ్ళాన్ని వాడు కొట్టుకుంటాడు"?

బానిస పారిపోయి, యజమానితో సంబంధాన్ని ధిక్కరించడం చాలా తప్పు. స్త్రీల సంగతీ అంతే. భర్తతో సంబంధం తెంపుకోవడం పెద్ద అపకీర్తి. అన్ని విధాలా యజమానికి లోబడి వినయ విధేయతలతో సేవ చెయ్యడం మాత్రమే బానిస ధర్మం. అదే గొప్ప కీర్తి. అలా చేస్తే ఆ బానిస వుత్తమ సేవకుడవుతాడు. స్త్రీ పరిస్థితీ అంతే. భర్తకి లోబడి, వినయ విధేయతలతో సేవ చేస్తే ఆ స్త్రీ ఉత్తమ గృహిణి, పతివ్రత.

ఈ రకంగా స్త్రీ పరిస్థితి కేవలం బానిస పరిస్థితే. కార్మికుడి పరిస్థితి కూడా కాదు. పెట్టుబడిదారుడి దగ్గర కార్మికుడికి కొన్ని హక్కులు వుంటాయి. శ్రమ చేయడానికి కాల పరిమితి వుంటుంది. కార్మికుణ్ణి పెట్టుబడిదారుడు కొట్టడానికి వీలు లేదు. కొడితే నేరం అవుతుంది. కార్మికుడికి ఇష్టం లేకపోతే ఒక పెట్టుబడిదారుణ్ణి వదిలెయ్యవచ్చు.

బానిస పరిస్థితి కన్నా కార్మికుడి పరిస్థితి అనేక విధాల మెరుగ్గా వుంటుంది. పురుషుడితో స్త్రీ సంబంధం అలాంటి

**పేద వర్గాల స్త్రీలు దరికి ఎంతో కొంత సంపాదన వుంటుంది. పేద వాళ్ళతో పోలిస్తే, ఇతర వర్గాల స్త్రీలు పెద్ద జీతాలే తెచ్చుకుంటారు. కానీ, వాళ్ళు ఆర్థికంగా పురుషులు వున్నంత స్వతంత్రంగా ఉంటున్నారా? కుటుంబ వ్యవహారాలు గానీ, డబ్బు ఇచ్చి పుచ్చుకునే లావాదేవీలూ అన్నీ స్వతంత్రంగా చేస్తున్నారా! ఏవో వాళ్ళకు కావలసిన బట్టలూ, నగలూ కొనుక్కునే స్వతంత్రత వాళ్ళు ప్రదర్శించగలరేమో గానీ, తమ సంపాదనని కుటుంబానికి ఎలా ఖర్చు పెట్టాలి అనే విషయంలో ఆడవాళ్ళ పాత్ర ఎంత వుంటుది? భార్య భర్తలిద్దరూ సంపాయించే కుటుంబాల్లో (పేదల్లో గానీ ధనికుల్లో గానీ) ఒక పనిమీద డబ్బు ఖర్చు పెట్టాల్సి వచ్చినప్పుడు భార్యభర్తల మధ్య సమాన స్థాయి చర్చలు జరుగుతాయా?**

మెరుగైన పరిస్థితిలో లేదు. పూర్తిగా యజమాని దగ్గర వుండే బానిస పరిస్థితిలాగే వుంది.

ఇక ఈ సంపాదన కూడా లేని స్త్రీ మాట చెప్పనే అక్కర్లేదు. సంపాదన వున్నవాళ్ళే పురుషుడి అజమాయిషిలో వుంటే, అదిలేని వాళ్ళ సంగతి చెప్పేదేముంది? వాళ్ళు నూటికి నూరుపాళ్ళూ బానిసలే. పోషణకి భర్తల మీదే ఆధారపడాలి గనక. స్త్రీ "ఇంటిపని"కే అంకితమైపోవలసిరావడం, 'పిల్లల పెంపకం' తల్లికే సంబంధించిన పనిగా వుండడం, ఇవి కూడా పెద్ద సమస్యలే. ఆర్థిక స్వాతంత్ర్యం కలగడంతోపాటు, వీటికి కూడా పరిష్కారాలు దొరికితేనే గానీ, ఆడవాళ్ళ జీవితాలు ఇప్పటి బానిసత్వం నుంచి బయటపడవు.

**ప్ర:- కుటుంబంలో స్త్రీ స్థానం?**

జ:- భర్తతో సంబంధం అంటే కుటుంబంలో పరిస్థితే కదా! భర్త యజమాని. భార్య దాసి. ఇది నిజం కానట్టు కనపడుతుంది పైకి. కానీ ఆ సంబంధానికి వున్న స్వభావం అదే పోషణ కోసం భర్త మీదే ఆధారం. సాంఘికంగానూ, చట్టాలలోనూ కూడా అతనికి లోబడి వుండవలసిన పరిస్థితే. భార్యభర్తల మధ్య "సమానత్వం" అన్న ప్రశ్నేలేదు.

**ప్ర:- స్త్రీ బానిసత్వానికి కారణం?**

ఇంకా కొన్ని కారణాలు వున్నాయి గానీ, ముందు దీన్ని గురించి ఒక వివరణ ఇవ్వాలి. పేద వర్గాల స్త్రీలందరూ పనులు చేసి డబ్బు సంపాయిస్తూనే వున్నారు. అలాగే ధనిక వర్గాల స్త్రీలూ, మధ్యతరగతి స్త్రీలూ కూడా స్వతంత్రంగానే వున్నట్టు కనపడుతుంది. కానీ ఆర్థిక విషయంలో నిజంగా స్వతంత్రంగా వుండటం అంటే ఏమిటి? ఆ "సంపాదన"కు వెళ్ళడం విషయంలోనూ, ఆ సంపాదనని వుపయోగించే విషయంలోనూ స్వతంత్రం వుండాలి. కానీ అలా వుండడం లేదు. చాలా మంది స్త్రీలు ఉద్యోగాలు చెయ్యడం, భర్తల ఇష్టా ఇష్టాలమీదా, పర్మిషన్ల మీద ఆధారపడి వుంటుంది.

ఒక భూస్వామి, తన పాలేరుని తన దగ్గర పనిలేనప్పుడు ఇతర్ల దగ్గరికి కూలి పనికి పంపి ఆ కూలిని తనే తీసుకుంటాడు. దాదాపుగా అలాగే వుంటుంది స్త్రీల ఆర్థిక స్వాతంత్రం.

ఇంకో ఉదాహరణ చూడండి. ఒక కొడుకు వుద్యోగం చెయ్యాలో లేదో తండ్రే నిర్ణయిస్తాడనుకోండి. కొడుకు తెచ్చిన జీతం మీద తండ్రే పెత్తనం చేస్తాడనుకోండి. కొడుకు ఖర్చుల కోసం కొంత డబ్బు తండ్రి మంజూరు చేస్తూ వుంటాడనుకోండి. ఇలా జరిగితే. ఆ కొడుకు 'ఆర్థిక స్వాతంత్ర్యం'తో ఉన్నాడనవచ్చా? అలాగే స్త్రీల విషయం కూడా. పేద వర్గాల స్త్రీలు దరికి ఎంతో కొంత సంపాదన వుంటుంది. పేద వాళ్ళతో పోలిస్తే, ఇతర వర్గాల స్త్రీలు పెద్ద జీతాలే తెచ్చుకుంటారు. కానీ, వాళ్ళు ఆర్థికంగా పురుషులు వున్నంత స్వతంత్రంగా ఉంటున్నారా? కుటుంబ వ్యవహారాలు గానీ, డబ్బు ఇచ్చి పుచ్చుకునే లావాదేవీలూ అన్నీ స్వతంత్రంగా చేస్తున్నారా! ఏవో వాళ్ళకు కావలసిన బట్టలూ, నగలూ కొనుక్కునే స్వతంత్రత వాళ్ళు ప్రదర్శించగలరేమో గానీ, తమ సంపాదనని కుటుంబానికి ఎలా ఖర్చు పెట్టాలి అనే విషయంలో ఆడవాళ్ళ పాత్ర ఎంత వుంటుది? భార్య భర్తలిద్దరూ సంపాయించే కుటుంబాల్లో (పేదల్లో గానీ ధనికుల్లో గానీ) ఒక పనిమీద డబ్బు ఖర్చు పెట్టాల్సి వచ్చినప్పుడు భార్యభర్తల మధ్య సమాన స్థాయి చర్చలు జరుగుతాయా? ఆ విషయం మీద ఇద్దరూ స్వతంత్రుల్లాగ, సరిసమానుల్లాగ మాట్లాడుకోవడమూ, ఆడవాళ్ళ వాదాన్ని మొగవాళ్ళు బాధ్యతతో వినడమూ, అవసరమైన ప్రశ్నకి జవాబులు చెప్పడమూ, చివరికి వాదోపవాదాల్లో ఏది సరైందని తేలితే ఆ ప్రకారమే చెయ్యటమూ జరుగుతాయా? ఇందులో వందో వంతు కూడా జరగదని వేరే చెప్పనక్కరలేదు.

పురుషాహంకారం తొణికిసలాడే భర్తలైతే ఏ విషయానికీ భార్యతో సంప్రదించడం వుండదు. భార్య సంపాదనని కూడా తన ఇష్ట ప్రకారం ఖర్చు పెట్టడానికి ఆయనకి జన్మహక్కు వుంటుంది. కొంచెం పురుషాహంకారం తొణికిసలాడని భర్తలైతే డబ్బుతో పెద్దపెద్ద వ్యవహారాలు చేసేటప్పుడు భార్యని కాస్త సంప్రదిస్తారు. ఇలాంటి కేసుల్లో భార్యలు తమ సంపాదనలపై సమస్త హక్కుల్ని భర్తలకు ఇచ్ఛాపూర్వకంగానే ధారా దత్తం చేస్తారు. ఆ భర్తలు కుటుంబాన్ని తెలివిగానే నిర్వహిస్తారనీ అనవసరపు. విషయాలకోసం డబ్బు తగలెయ్యరనీ నమ్మిన భార్యలు ఆ డబ్బు ఖర్చు వ్యవహారంలో గట్టిగా కలుగ జేసుకోరు. ఏ విధంగా చూసినా రెండు సంపాదనల్ని ఖర్చు

పెట్టే విషయంలో భర్తే నిర్ణయాలు చేసే వ్యక్తిగా వుంటాడు. డబ్బుకి సంబంధించిన అనేక విషయాల్లో స్త్రీలు స్వతంత్రంగా ప్రవర్తించలేరు. ఎవరికైనా సహాయం చెయ్యడానికి గానీ, చందాలు ఇవ్వడానికి గానీ పేద బంధువులకి సర్ధడానికి గానీ, దేనికీ స్త్రీలు స్వతంత్రించరు. (నగలు కొనుక్కునేప్పుడు వారికి వున్న స్వతంత్రత నగలు అమ్మవలసి వస్తే మాత్రం వారికి వుండదు). ఒక నగ అమ్మి ఎవరికైనా సహాయం చేసే పని (చెయ్యాలని వున్నప్పటికీ) స్త్రీలు చెయ్యలేరు. అబద్ధపు లెక్కలు చెప్పవలిసిందేగానీ, నాకీ పని చెయ్యాలనిపించింది చేశాను. "నా సంపాదనని నాకిష్టమైనట్లు ఖర్చు పెడతాను". స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యం అంటే కేవలం సంపాదించడమే ఆర్థిక స్వాతంత్ర్యం కాదు. పురుషుడి మీద ఆధారపడకుండా ఖర్చు చెయ్యగల స్వభావం ఈ స్వతంత్ర్య స్త్రీ సంపాదనకు వుండడం లేదు.

ఇక ఈ సంపాదన కూడా లేని స్త్రీ మాట చెప్పనే అక్కర్లేదు. సంపాదన వున్నవాళ్ళే పురుషుడి అజమాయిషిలో వుంటే, అదిలేని వాళ్ళ సంగతి చెప్పేదేముంది? వాళ్ళు నూటికి నూరుపాళ్ళూ బానిసలే. పోషణకి భర్తల మీదే ఆధారపడాలి గనక. స్త్రీ "ఇంటిపని"కే అంకితమైపోవలసిరావడం, 'పిల్లల పెంపకం' తల్లికే సంబంధించిన పనిగా వుండడం, ఇవి కూడా పెద్ద సమస్యలే. ఆర్థిక స్వాతంత్ర్యం కలగడంతోపాటు, వీటికి కూడా పరిష్కారాలు దొరికితేనే గానీ, ఆడవాళ్ళ జీవితాలు ఇప్పటి బానిసత్వం నుంచి బయటపడవు.

**1. "ఆర్థికంగా పురుషుడి మీద ఆధార పడే సమస్య":–** అది పరిష్కారమవ్వాలంటే, స్త్రీ సంపాదన స్త్రీకి వుండాలి. అంతేకాదు. దాన్ని స్వతంత్రంగా వుపయోగించుకునే చైతన్యంతో వుండాలి. అంటే తన సంపాదన తనే ఖర్చుపెట్టుకోవాలని కాదు. దాన్ని ఖర్చు పెట్టే నిర్ణయాల్లో ఆమెకి పురుషుడితో సమానమైన పాత్ర వుండాలి.

**2. "ఇంటిపని" సమస్య:–** ఇంటిపని మానిపారెయ్యడమే కాదు పరిష్కారం? పురుషుడు బైట ఏఏ పనులు చేసే పరిస్థితి వుందో స్త్రీకి కూడా ఆ పరిస్థితి వుండాలి. ఎందుకంటే, అమ్మడానికి సరుకులు తయారు చేస్తేనో, లేదా సమాజానికంతటికీ అవసరమైన ఇంకోపని చేస్తేనో. మాత్రమే

**ఇంటి పనులన్నీ సామాజికం అయిపోతాయి. ముఖ్యంగా 'వంట'. దాన్ని సమిష్టి బాధ్యతతో నిర్వహిస్తారు. స్కూళ్ల దగ్గరా ఫ్యాక్టరీల దగ్గరా ఆఫీసుల దగ్గరా, సమిష్టి వంటశాలల్లో వంట చేస్తారు. ఆ ఉద్యోగాల్లో వున్న వాళ్లు ఆ పని చేస్తారు. విడివిడిగా ప్రతి ఇంట్లోనూ ఒక పొయ్యీ, ఒక వంటా, ఆ వంట కోసం ఒక ఆడది జన్మంతా బానిసగా పడి వుండడం అనే చెత్త పరిస్థితి పోయినపుడే స్త్రీకి గృహబానిసత్వం పోయి, సమాజానికి వుపయోగపడుతూ తనని తను స్వేచ్ఛగా వుంచుకోగలుగుతుంది.**

**స్త్రీలందరికీ పనులు చూపించ గలగడం, ఇంటి పనుల్ని సామాజికం చెయ్యగలగడం, పిల్లల పెంపకంలో బాధ్యత తీసుకోగలడం. ఈ రకం మార్పులు స్వంతాస్థిలేని సోషలిస్టు సమాజంలోనే సాధ్యమవుతాయి కాబట్టి ఆ సమాజమే స్త్రీలకి విముక్తి కలిగిస్తుంది.**

ఆ శ్రమకి "మారకం విలువ" వుంటుంది. అంటే ఈ శ్రమ బదులుగా డబ్బు వస్తుంది. ఇంటిపని అనేది అందరి కోసం జరిగే పని కాదు. కాబట్టి స్త్రీలు ఇంట్లో ఎంత శ్రమ చేసినా, వంటలు ఎంత రుచిగా వండినా, గిన్నెలు ఎంత తళతళలాడేట్టు తోమినా ఆ పనుల వల్ల ఆమె చేతిలోకి ఒక్క పైసా సంపాదన రాదు. ఇంత చాకిరీ చేసినా, భర్త సంపాదన మీద ఆధారపడి బతకవలసిందే. భర్త పోషణలో వుండవలసిందే.

అయితే భర్త ఆమెని అప్పనంగా పోషిస్తున్నాడా? ఆమె సోమరిగా కూచుని వుంటే అతను దయతల్చి పోషిస్తున్నాడా? లేదు. తనకి వండిపెట్టి, ఇతర పనులు చేస్తూ, పిల్లల పెంపకంలో అతని బాధ్యతని కూడా ఆమె చేస్తూ వుంటేనే పోషిస్తున్నాడు. అంటే, ఆమె శ్రమని తను తీసుకుని, తన శ్రమని ఆమెకిస్తున్నాడు. అయితే ఆమె నుంచి తీసుకునే శ్రమకి విలువ లేదు. తను ఇచ్చే శ్రమకి విలువ వుంది. అందువల్ల భర్తకి ఏమనిపిస్తుందంటే, ఒక్క పైసా సంపాదనలేని ఆడమనిషిని తన కష్టార్జితంతోనే పోషిస్తున్నాననిపిస్తుంది. భార్య కూడా అలాగే భర్త కష్టార్జితం వల్లే తను బతుకుతున్నాని భావిస్తుంది. నిజానికి భార్య శ్రమ చేయకుండా భర్త పోషించడం లేదు. భర్త బైటికి వెళ్ళి కూలో, జీతమో సంపాయించి తెస్తున్నాడంటే, అతనికా శ్రమ శక్తి కలగడానికి కారణం భార్య శ్రమ కూడా అతనికి వుపయోగపడడం ఆమె శ్రమకి మార్కెట్ విలువ లేకపోవడం వల్ల ఆమె చేసే పనులకి, అతని దృష్టిలోనూ, సంఘం

దృష్టిలోనూ కూడా విలువ వుండదు. ఆమె అతని దయాదాక్షిణ్యాల మీదే బతకవలసి వుంటుంది. స్త్రీ శ్రమకి విలువ లేకుండా పోవడమే ఆమె సమస్య. అందుకే ఆమె శ్రమ, విలువ లేని ఇంటి పనుల్లో ఖర్చుయిపోకూడదు. పురుషుడెలాగైతే సమాజానికి అవసరమైన పనులు చేసి డైరక్టుగా డబ్బు సంపాయించుకొని తనని తను పోషించుకునే స్వతంత్ర పరిస్థితిలో వున్నాడో, స్త్రీ కూడా అలాగే తన శ్రమని సమాజానికి అవసరమైన పనులలో మాత్రమే ఖర్చుపెట్టి, స్వతంత్రంగా తనని తను పోషించుకునే పరిస్థితిలో వుండాలి.

అపుడు ఇంటి పనుల సంగతేమిటినే ప్రశ్న వస్తుంది. చాలా క్లుప్తంగా జవాబు చెప్పాలంటే అప్పుడు ఇంటి పనులన్నీ సామాజికం అయిపోతాయి. ముఖ్యంగా 'వంట'. దాన్ని సమిష్టి బాధ్యతతో నిర్వహిస్తారు. స్కూళ్ల దగ్గరా ఫ్యాక్టరీల దగ్గరా ఆఫీసుల దగ్గరా, సమిష్టి వంటశాలల్లో వంట చేస్తారు. ఆ ఉద్యోగాల్లో వున్న వాళ్లు ఆ పని చేస్తారు. విడివిడిగా ప్రతి ఇంట్లోనూ ఒక పొయ్యా, ఒక వంటా, ఆ వంట కోసం ఒక ఆడది జన్మంతా బానిసగా పడి వుండడం అనే చెత్త పరిస్థితి పోయినపుడే స్త్రీకి గృహబానిసత్వం పోయి, సమాజానికి వుపయోగపడుతూ తనని తను స్వేచ్ఛగా వుంచుకోగలుగుతుంది. ఇది రెండో సమస్యకి పరిష్కారం.

3. పిల్లల పెంపకం ఇప్పుడున్న పరిస్థితుల్లో ఇది తల్లికి పెద్ద భారంగా, గుదిబండగా వుంది. తల్లి నిశ్చింతగా బైటికి వెళ్ళి పని చెయ్యగలిగే పరిస్థితి లేదు. అందుచేత దీనికి పరిష్కారం ఏమిటంటే. తల్లి బైటికి వెళ్ళి నిశ్చింతగా పని చేసుకోగలిగే పరిస్థితి ఏర్పడాలి. తల్లి వదిలి పెట్టి వెళ్ళినపుడూ, తల్లికి విశ్రాంతి కావల్సి వచ్చినప్పుడు పిల్లల్ని తల్లిలాగే పెంచే ఏర్పాట్లు వుండాలి. అంటే పిల్లల పెంపకం బాధ్యతంతా తల్లికే సంబంధించిందిగా కాకుండా, తండ్రీ, సమాజమూ కూడా ఆ బాధ్యతని స్వీకరించి, ఆ ఏర్పాట్లు చేసినప్పుడు స్త్రీకి వున్న మూడో సమస్య కూడా పరిష్కారమైపోతుంది.

స్త్రీలందరికీ పనులు చూపించ గలగడం, ఇంటి పనుల్ని సామాజికం చెయ్యగలగడం, పిల్లల పెంపకంలో బాధ్యత తీసుకోగలడం. ఈ రకం మార్పులు స్వంతాస్థిలేని సోషలిస్టు సమాజంలోనే సాధ్యమవుతాయి కాబట్టి ఆ సమాజమే స్త్రీలకి విముక్తి కలిగిస్తుంది. మహిళా అభివృద్ధి సోషలిజంలోనే సాధ్యం అని రష్యాలో సోషలిస్టు విప్లవం నిరూపించింది. సోషలిజం కొరకు చెయ్యిచెయ్యి కలుపు. స్వేచ్ఛ అనేది నీ సొంతం, స్వేచ్ఛ అనేది ఒకరు ఇవ్వరు, ఎదురించి పోరాడి గెలుచుకో, స్వేచ్ఛగా జీవించు.

---

# జ్వలనం

వెలుగై నిలిచినపుడు
అది ఒక దీపం
చీకట్లు పారద్రోలుతూ ప్రకాశిస్తే
అది ఒక జ్యోతి
వెలుగులు పంచుతూ దిశానిర్దేశనం
చేసే వేళలో అది ఓ కాగడా
ప్రమాణాలకు సాక్షీభూతమై
నిలచిన వేళ
అది అగ్నిహోత్రం
అంతే కాదు – అది నీలో
పగగా నిలచి రగిలినపుడు 'జ్వాలగానూ'
చింతగా మారి జ్వలించినపుడు
'చితి'గానూ
మనసును దహించే జ్వలన శక్తిగా
రగిలిన
జిజ్ఞాస నీలో మొదలైతే
అఖండ జ్యోతిగా వెలుగుతుంది!!
నిత్య చైతన్యానికి ప్రతీకగా
మెదులుతూ ఉంటుంది!!

- దుర్గా ప్రసన్న

# ఆధునిక ప్రజాస్వామ్య యుగ లక్షణం లౌకికవాదం

వ్యాసం

-దివికుమార్, ప్రధాన కార్యదర్శి, జనసాహితి

"ఇదేనా లౌకికవాదం?" అంటూ మార్చి నెల 24న సీనియర్ జర్నలిస్ట్ ఆలపాటి సురేష్‌కుమార్ రాసిన వ్యాసంపై వ్యాఖ్యానిస్తూ ఈనెల ఏప్రిల్ 2న "సంకుచిత లౌకికవాదం వద్దు" అంటూ బండి ప్రదీప్ కుమార్, 7వ తేదీన "మనది లౌకికవాదం కాదా?" అంటూ చాణక్య రాశారు. స్థూలంగా సురేష్‌కుమార్ రాసిన, ఉదహరించిన అంశాలు ఉదాహరణలు సరిగానే ఉన్నప్పటికీ, లౌకికవాదమంటే మతవ్యతిరేక వాదమన్నట్లూ, అలాగైతే అది సంకుచిత వాదమవుతుందని ఒకరూ, హిందువులకు హిందువులమని చెప్పుకునే హక్కులేకుండా చేసేవాదమే లౌకికవాదమన్నట్లు మరొకరూ రాశారు. నూరేళ్ళుగా ప్రజాస్వామిక రాజకీయాలతో నడుస్తున్న దేశంలో 68 ఏళ్ళుగా లౌకిక ప్రజాస్వామ్య రాజ్యాంగ పరిపాలన క్రింద జీవిస్తున్నామనుకుంటున్న దేశంలో లౌకికవాదమంటే ఏమిటో ఇంకా చర్చించుకునే దశలోనే వున్నామా? లేక బ్రహ్మపదార్థంగా మార్చి మసిబూసి మారేడు కాయగా మిగల్చదలుచుకున్నామా? అని ప్రశ్నించుకోవాల్సిన స్థితికి చేరాము. ఎందుకంటే అమెరికా అధ్యక్షుడు ఒబామా వచ్చిన సందర్భంలో ఆయనతో సుద్దులు చెప్పించుకోవాల్సి రావటమేకాక, కేంద్రప్రభుత్వం రిపబ్లిక్ దినోత్సవంనాడు రాజ్యాంగంలోని "లౌకిక, సోషలిస్ట్" పదాలను మినహాయిస్తూ కావాలని విడుదల చేసిన ప్రకటన కూడా యాదృచ్ఛికంగా జరగలేదనుకోవాల్సి వుంది. వీటన్నిటి దృష్ట్యా "లౌకికవాదం" సైద్ధాంతికంగా, చారిత్ర కంగా, ఆచరణ సంబంధమైన స్పష్టతను కోరుతోందని అర్థమవుతోంది. అనేక అసంగతాలను వీడి 'లౌకికవాదం' సమస్య యొక్క కీలకాంశాలకే పరిమితమై యిది రాస్తున్నాను.

ఇందుకు మన సంప్రదాయంలోని ఒక చిన్న ఉదాహరణతో మొదలుపెడతాను. తెలుగువారింట జరిగే మంత్రాల పెళ్ళిళ్ళలో ఒక ముఖ్యమైన మంత్రం యిలా వుంటుంది. "ధర్మేచ, అర్థేచ, కామేచ.... త్రయేషా నాతి చరితవ్యాః" అని పురోహితుడు మంత్రం చదివి పెళ్ళికొడుకుతో "నాతి చరామి" అనిపిస్తాడు. ఇది అందరూ విన్నదే. ధర్మేచ అంటే సంసార ధర్మములో, అర్థేచ - ఆస్తిపాస్తుల వ్యవహారాలలో, కామేచ - సమస్త జీవితాకాంక్షలలో.... ఈ మూడింటి లోనూ భార్యవైన నిన్ను అతిక్రమించి ప్రవర్తించను... అని భర్త చేసే ప్రమాణమే ఈ మంత్రార్థం. ధర్మార్థ కామమోక్షాలనే నాలిగింటినీ కలిపి పురుషార్థాలు అంటారు. మన చర్చనీయంశం "మోక్షాని"కి సంబం ధించినది. మంత్రంలోనే త్రయేషా. (మూడింటి విషయంలో) అని వున్నది కనుక చాలా ఖచ్చితంగా 'మోక్షేచ'ను ఈ మంత్రం నుండి మినహాయించారనేది స్పష్టం. ఎందుచేత? అన్నది ప్రశ్న. మొదటి మూడూ ఇహలోక సంబంధమైనవి. అంటే మన రోజువారీ జీవితానుభవానికి చెందినవి. వాటినే లౌకికమైనవి అంటారు. అవి మన చుట్టూ, మన కళ్ళముందు, మనతో వున్నవి మనం అనుభవించేవి, మనం వ్యవహరించ వలసినవీ, మనం సరిదిద్దుకోగలిగినవే ఈ మూడూ. మోక్షమన్నది పరలోక సంబం ధమైనది. సాంప్రదాయక విశ్వాసాల ప్రకారం వ్యక్తిగత మోక్షమున్నదే కాని, భార్యా, బిడ్డల, బంధువుల, మిత్రుల సమేతంగా మోక్షమన్న భావనే లేదు. అంటే మోక్షం ఎవరికి వారిదే. కారణమేంటి... పరలోకమన్నది ఊహా ప్రపంచం. నిజంగా అక్కడ ఏమున్నదో, ఎలా వున్నదో అసలున్నదో లేదో దానికై ఖచ్చితమైన సాధ్యాసాధ్యాలేమిటో... పరిపరి విధాల వ్యాఖ్యానాలున్నాయేకానీ నిర్దుష్టత పూచీ లేవు. అక్కడికి వెళ్ళి చూసి వచ్చినవాడూ లేడు. అంటే మోక్షమన్నది విశ్వాసమే కాని మానవ అనుభవంలోకి, అమలులోకి వచ్చే హామీ ఎవరూ యివ్వలేరు. ఎవరి విశ్వాసాల కనుగుణంగా వారు ప్రయత్నించుకోదగినది కనుక మోక్షంకు భార్యాభర్తల బంధం ఏమీలేదని అర్థం. (స్త్రీలకు మోక్షమే లేదనే వాదాన్నీ, పెళ్ళి తంతులోని పితృస్వామిక నీతుల్ని కాసేపు పక్కనుంచుదాం). సారాం శంలో వాస్తవికమైన ఇహలోక (లౌకిక) సంబంధ విషయాలలోనే "అతిక్రమించను" అనే ప్రమాణాన్ని చేయగలరుగానీ పరలోక

**తెలుగు వారింట జరిగే మంత్రాల పెళ్ళిళ్లలో ఒక ముఖ్యమైన మంత్రం ఇలా వుంటుంది. "ధర్మేచ, అర్థేచ...త్రయేషా నాతి చరితవ్యా:" అని పురోహితుడు మంత్రం చదివి పెళ్లికొడుకుతో "నాతి చరామి" అనిపిస్తాడు. ఇది అందరూ విన్నదే. ధర్మేచ అంటే సంసార ధర్మంలో, అర్థేచ - ఆస్థిపాస్తుల వ్యవహా రాలలో, కామేచ-సమస్త జీవితా కాంక్షలలో... ఈ మూడింటిలోనూ భార్యవైన నిన్ను అతిక్రమించి ప్రవర్తిం చను... అని భర్త చేసే ప్రమాణమే ఈ మంత్రార్థం. ధర్మార్థ కామమోక్షాలనే నాలుగింటినీ కలిపి పురుషార్థాలు అంటారు.**

సంబంధమైన మోక్షానికి హామీ ఎవరూ యివ్వలేరు. కనుక పెళ్ళి మంత్రాలలో కూడా మోక్ష విశ్వాసాన్ని పక్కన బెట్టారన్నమాట!

ఇపుడు మనం రాజ్యం దగ్గరకూ, ప్రభుత్వాల దగ్గరకూ వద్దాం. మతవిశ్వాసాల ప్రకారం "ఎర్ర చందనం దొంగలకు ఆయుష్షుతీరి, పోలీసుల చేతుల్లో ఎన్‌కౌంటర్ అయారు. యమధర్మరాజు ఆదేశాన్ని ఆయన భటుల్లాగా పోలీసులు పాటించటాన్ని తప్పుపట్టకూడదు" అని ఎవరైనా కోర్టులో వాదిస్తే ఎలా వుంటుంది? సామాజిక అసమానత్వాలు పెరగటానికి కారణం ఆయా వర్గాలవారి 'ఖర్మ' అది వారి పూర్వజన్మ సుకృతం, లలాట లిఖితం..... అని పురాణం శాస్త్రుల్లవారు చెప్పినట్టే ప్రభుత్వాలు కూడా చెప్పేస్తే ఎలా వుంటుంది. బాబ్రీ మసీదు లోపల సీతా రాముల విగ్రహాలను వందలాది సాయుధ పోలీసుల పహారాతో కాపాడుతున్నారుగదా! దేవుడ్ని మనుషులు కాపాడుతున్నారా? మనుషుల్ని దేవుడు కాపాడుతున్నాడా? అని ప్రశ్నిస్తే నిజమైన రక్షకులెవరో బయట పడుతుంది గదా! లౌకిక ప్రపంచం అంటే ఇహలోకం. అది వాస్తవికమైనది. 'గాలిలో దీపంపెట్టి దేవుడా నీ మహిమ' అనే వాళ్ళను వెర్రివాళ్ళంటారు. వాస్తవిక ప్రపంచమేకాక మనుషుల ఆలోచనలలో ఊహా ప్రపంచాలు కూడా వున్నాయి. అందులో పరలోకమొకటి. అది కేవలం విశ్వాస సంబంధమైనది. ప్రజలలో విశ్వాసాలు మతాలవారీగా, దేవుళ్ళవారీగా పరిపరివిధాల ఉండొచ్చు. వాటిని మనం గౌరవించనూవచ్చు, చర్చించ నూవచ్చు. కానీ చట్టాలు, శాసనాలూ, న్యాయవ్యవస్థ, పోలీసు బలగాలూ, అధికార గణాలు, ప్రజలకు పూచీ పడాల్సిన రాజకీయ పార్టీలు..... ఒక్క మాటలో ప్రభుత్వాలు - ప్రజల వాస్తవిక జీవన స్థితిగతుల మంచి-చెడులకు బాధ్యత వహించాల్సిందే తప్ప వాటిని పరలోక, దైవ, మత విశ్వాసాలకు లంకె పెట్టటానికి కుదరదు. కొత్త రాజధాని నిర్మాణం యొక్క ఫలితాలకు ప్రభుత్వాలు, నాయకులు బాధ్యత వహించాలిగానీ 'వాస్తు' యొక్క ప్రభావాల పేరుతో రాజ్యం తప్పించుకోలేదు. నిజానికి మతవిశ్వాసం ప్రకారం వ్యవహ రించే వారి అనేకానేక చేతలు కూడా లౌకిక మైనవే. దేవుని దగ్గర బాజా, భజంత్రీలు వాయించాలంటే ఎంత మానవ శ్రమ కావాలి? పూలు, హారతి కర్పూరం, సాంబ్రాణి, ప్రసాదం, హుండీలు.... లెక్కింపులూ, ఒక్కటేమిటి సమస్తం ఇహలోక ప్రకృతి నుండి మానవ యత్నంతో సాధించేవే. ఇవన్నీ ఫక్తు లౌకికమైనవే కదా! ఈలాంటి పూజలు చేస్తే తమ ఈతి బాధలు నివారణవుతాయని ప్రజలు విశ్వసించటం వేరు. ప్రభుత్వాలే ఆ పని చేయటం మొదలుపెడితే విదేశీ బ్యాంకుల్లో నల్లధనానికీ, అధిక ధరలు నేలకు దిగటానికీ, అవినీతి అంతం కావటానికీ, మహిళలు భద్రంగా జీవించగలగటానికీ దళితులు గౌరవంగా బతకటానికీ - యజ్ఞాలూ, యాగాలూ చేస్తాం.... కొలుపులూ, బలులూ యిస్తాం - పుష్కరాలూ - పూజలూ జరుపు తామంటే - నాటకంలో హరిశ్చంద్రుడన్నట్లు "ఈలాంటి రాజులు వుండిననేమి! మండిననేమి!!"

ఆధునిక ప్రభుత్వాలు పాటించా ల్సినదీ, అమలు పరచాల్సినవీ రాజ్యాంగాన్నీ అందులోని ఆదేశిక సూత్రాలనూగాని దేవుడు దయతలిస్తే అవినీతిని అరికడతాం అని అనటానికి లేదు. రాజ్యం యిహలోక సంబంధిత వ్యవహారాలను చక్కబెట్టటానికి ఏర్పాటయినదే కాని పరలోకాన్ని గురించిన, మత విశ్వాస సంబంధమైన హామీలను యివ్వటానికి రూపొందినది కాదు. అంతేకాక ఇహలోక లౌకిక సమస్యలకు ఇక్కడే, మనుషులమే, మనుషులు నిర్మించుకున్న రాజ్యాలే పరిష్కారం చూపాల్సిన బాధ్యత పడాలి తప్ప, భగవంతునిపైన భారంవేసి తప్పించుకోవటానికి వీలులేదు. ప్రభుత్వాలే మత విశ్వాసాల ప్రకారం వ్యవహరించ దలిస్తే ఆసుపత్రులకు బదులు స్వస్థత

కూటములనూ, నేరస్తులను కనిపెట్టటానికి జ్యోతిష్యులనూ, సకాలంలో రైతులకు నీళ్ళు అందించటానికి వరుణ యజ్ఞాలు చేసే మాంత్రికులనూ, పాఠశాల విద్యార్ధుల ఉత్తీర్ణత పెంచటానికి టెంకాయలనూ ఆశ్రయించాల్సి వుంటుంది. వాటివల్ల ఫలితాలు రాకపోతే వారిని నేరస్తులుగా న్యాయస్థానాలలో విచారించాల్సి వుంటుంది. ఇది వినటానికే హాస్యాస్పదంగా లేదూ?

అనేక మత విశ్వాసాల నడుమ సహజీవనం, సంఘర్షణలతో నడిచిన చారిత్రక అనుభవాలు అనేకం మనకున్నాయి. ఆర్య - అనార్య, శైవ-వైష్ణవ సంఘర్షణలు మనమెరిగినవే. హరిహరనాథ తత్త్వం ఎందుకు పుట్టింది? "శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే; శివశ్చ హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగుం శివహః" అనే భావం ఎంత రక్తపాతాలనంతరం నిలదొక్కుకుంది?

ప్రధమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో హిందూ-ముస్లింల ఐక్యత బలంగా ఏర్పడిన మేరకు బ్రిటీషు పాలకులు ఓటమి అంచులకు చేరటం, ఆ ఐక్యతను బలహీనపరచగలిగిన ఫలితంగా గెలుపును పొందటం, ఈ చరిత్ర పాఠాల నుండే కదా "విభజించు, పాలించు"ను ఒక విధానంగా బ్రిటీషు పాలకులు అమలు జరిపారు! ఈనాడు కూడా మతాల నడుమ విద్వేషాలు పెంచేవారు. దేశాన్ని ఎలా అభివృద్ధి పరచగలరు?

రాచరిక యుగంలో అధికారాన్ని చేబట్టటానికి ప్రధానంగా భుజబలంమీద, సైన్య సమీకరణ శక్తిమీదా ఆధారపడ్డారు. ఆనాడు లిఖిత రాజ్యాంగం లేదు. ప్రజాభిప్రాయానికి చోటు లేదు. ప్రజల మీద సాంస్కృతికంగా పట్టు వున్న మత పెద్దల సలహాలు వుండేవి. చాలా సహజంగా సమాజంలో ఆర్థికంగా, సాంఘికంగా, ఆధిపత్యంలో వున్న కులాల, వర్గాల పెత్తనం రాజ్యం ద్వారా అమలు జరుగుతుండేది. అగ్రవర్ణ ఫ్యూడల్ పెత్తందారీతనాలతో, మతమౌఢ్యాల అగ్ని పరీక్షలతో సాంఘిక వివక్షలతో సామాన్యుల బతుకు పరమ దుర్భరంగా సాగింది. ఫ్రెంచ్ విప్లవాల్లాంటివి అలాంటి పరిస్థితుల నుండే పుట్టాయి. ఆధునిక శాస్త్ర విజ్ఞానాల ఫలితంగా హేతుబద్ధత, శాస్త్రీయ చింతన పెరిగి ప్రపంచాన్నంతా అవి ప్రభావితం చేశాయి. ఆధునిక ప్రజాస్వామ్య రాజ్యవ్యవస్థలు పరలోక విశ్వాసంతో, అతీత శక్తుల మహత్తులతో కూడిన మత విశ్వాసాల మీద ఆధారపడాల్సిన పరిస్థితి పోవటమే కాక

**విద్యారంగం బ్రాహ్మణుల గుత్తస్వామ్యంగా ఉండేది. బ్రిటీషువారి అవసరాలమేరకే అయినా లౌకిక విద్యలను నేర్చుకునే క్రమంలోనే కదా సమస్త కులాల్లో విద్య వికసించింది. ఇప్పటికీ హిందూ మతం కర్మకాండలన్నీ బ్రాహ్మణ పూజారి, పురోహితుల గుప్పెటలోనే ఉన్నాయి. హిందూమత పెద్దలు తమ వ్యవస్థలో అంతర్గత సంస్కరణలకైనా తలపెట్టకపోగా, వాటి గురించి మాట్లాడటమే హిందూ వ్యతిరేకమన్నట్లుగా వ్యవహరిస్తూ ఉంటారు.**

రాజ్యం మత విశ్వాసాలతో సంబంధం లేకుండా లౌకికంగా వ్యవహరించటమన్నది మానవ నాగరికత ముందడుగుకు చిహ్నంగా నిలిచింది. ఐతే మతవిశ్వాసం కలిగి వుండటం, మత మార్పిడిని రాజ్యాంగ హక్కుగా పొందటం వ్యక్తుల హక్కుగా లౌకికవాదం గుర్తించింది. భారతదేశం లాంటి అనేక మతవిశ్వాసాల ప్రజలున్నచోట ప్రజల నడుమ 'మత సామరస్యం పెంపొందేట్లు, మత ఘర్షణలు చెలరేగకుండా చూడటం రాజ్యాంగం యొక్క విధిగా వుంటుంది. 'సర్వమత సమభావం' అన్నది ప్రజలలో పెంపొందాల్సిన సాంస్కృతిక విలువవుతుందేగాని, అది ప్రభుత్వ విధానం కాకూడదు. ఎందుకంటే అది ఆచరణసాధ్యం కానిది. పాలకుల హిందూ మత విశ్వాసాలే రాజ్యం విశ్వాసాలుగా నేడు అమలు జరుగుతున్నట్లే అది వుంటుంది. ఈ తరహా ఆచరణ మతమైనారిటీలలోనూ, దళిత, ఆదివాసీలలోనూ ఈ దేశం, రాజ్యం తమది కాదేమోననే భావం గూడుకట్టుకోడానికి ఆస్కారం యిస్తుంది. 'సర్వమత సమభావమనేది' రాజ్యవిధానమనుకున్నప్పుడు, ప్రతి ప్రాజెక్టో, మరొకటో సమస్త ప్రారంభోత్సవాలకి అన్ని మతాలవారి ప్రార్ధనలూ, పూజాదికాలూ నిర్వహిస్తూ పోతుంటే ఎలా వుంటుందో ఒకసారి ఆలోచించండి.

మతభావజాలాలు, వాటి పేరిట అమలు జరిగే ఆచారాలు లోపరహితాలూ, విమర్శకు అతీతాలు కావు. కుళ్ళికంపు కొడుతున్న కుల వ్యవస్థను సమర్థించే, స్త్రీలను కించపరిచే భావజాలాల నుండి మతాలు

సంస్కరణ పొందాలి గదా! అలాగే ఒకనాటి మన గొప్ప ఖగోళ శాస్త్రజ్ఞులు సూర్యుడు - చంద్రుడు - ఇతర గ్రహాల చలనాలను లెక్కలు గట్టి చాలావరకు దిన, పక్ష, మాస, సంవత్సరాలను, సూర్య-చంద్ర గ్రహణా లను దాదాపు సరిగానే నిర్ధారించిన ఘన చరిత్ర గలవారే అయినప్పటికీ... అవన్నీ భూకేంద్ర సిద్ధాంతంగా.... అంటే భూమి చుట్టూ సూర్యుడూ... ఇతర గ్రహాలూ తిరుగు తున్నట్లుగా భావించి కట్టిన లెక్కలు. కొపర్నికస్, గెలీలియోలు... సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని ఆవిష్కరించిన పిదప ఖగోళ శాస్త్రం మరింత శాస్త్రీయతను సాధించింది. క్రిస్టియన్ మతగ్రంథాల ప్రకారం నాటి రాజ్యపాలకుల విధానంలో భాగంగా గెలీలియో, లియోర్డినో బ్రూనో లాంటివారు పాలకుల చిత్రహింసలను భరించారు. ప్రాణాలు కోల్పోవలసి వచ్చినా మత పీఠాలకూ, రాజ్యానికి తలవొగ్గకుండా శాస్త్రీయ ప్రయోగాల కొరకు నిలబడ్డారు. మనకు ఈనాటికీ మన గుడులలో వుండే నవగ్రహాలలో సూర్యుడు - చంద్రుడు వుంటారు. భూమి అసలు వుండదు. ఈ తల్లకిందుల విశ్వాసం ప్రాతిపదికపైనే జ్యోతిష్యాన్ని శాస్త్రమని కూడా నేటికీ వాదించే వారున్నారు. ఈలాంటి మతమౌఢ్యాన్ని సంస్కరించే దమ్ము ఆధునిక ప్రజాస్వామ్య రాజ్యాలకుండాలి. రాజకీయ పార్టీల కుండాలి. లేకుంటే మతమౌఢ్యానికి ఆమోదం తెలిపినవారే కాగలుగుతారు. ప్రజలలో వుండే మతవిశ్వాసాల్ని 'సొమ్ము' చేసుకునే మోసగాళ్ళు ఏ కాలంలోనైనా వున్నారని 'సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి'ని చదివినా, విశ్వనాథ సత్యనారాయణగారి 'స్వర్గానికి నిచ్చెనలు' నవల చదివినా అర్థమవుతుంది. ఈలాంటి వారిని లౌకిక రాజ్యాలు, వాటి చట్టాలు అదుపులో పెట్టాలి. సతీసహగమనాలూ, వితంతు వివాహాలు, స్త్రీలకు విద్య దళితుల పట్ల అంటరానితనమూ, వివక్షలను మత ఆచారాల పేరిట ప్రోద్బలించటం మనమెరిగినదే. వాటికి వ్యతిరేకంగా పోరాడి సంస్కరించుకుంటేనే గదా సమాజంలో కొన్ని ప్రగతిశీల మార్పులైనా వచ్చినది. కనుక రాజ్యం మతంపట్ల ప్రజాస్వామిక దృక్పథంతో సంస్కరించే వైఖరితో వుండా లేకానీ, నెత్తిన పెట్టుకుని ఊరేగే దృష్టితో ఉండతగదు.

ఒకనాడు విద్యారంగం బ్రాహ్మణుల గుత్తస్వామ్యంగా ఉండేది. బ్రిటీషువారి అవసరాలమేరకే అయినా లౌకిక విద్యలను నేర్చుకునే క్రమంలోనే కదా సమస్త కులాలలో విద్య వికసించింది. ఇప్పటికీ హిందూ మతం కర్మకాండలన్నీ బ్రాహ్మణ పూజారి, పురోహితుల గుప్పెటలోనే ఉన్నాయి. హిందూమత పెద్దలు తమ వ్యవస్థలో అంతర్గత సంస్కరణలకైనా తలపెట్టకపోగా, వాటి గురించి మాట్లాడ టమే హిందూ వ్యతిరేకమన్నట్లుగా వ్యవహరిస్తూ వుంటారు. ఒక్క మాటలో ప్రజాస్వామిక యుగంలో రాజ్యం లౌకికంగా... అంటే అన్ని మతాలకు సమాన దూరంగా ఉంటూనే, మత వ్యవస్థలను ప్రజాస్వామికం గావించే కృషిని చేపట్టాల్సి వుంది. కుల-మత-ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొట్టే ముఖ్యంగా ఎన్నికలకు వాటిని వినియోగించుకునే తత్వాన్ని నిరోధించాల్సి వుంది.

"హిందూ" మతవ్యవస్థ ఏకశిలాదృశం కాదు. అది అనేక భావజాలాల, విభిన్న ఆచార వ్యవహారాల విశాల సమాఖ్య లాంటిది. కొత్త దేవుళ్ళను సృష్టించుకోగలిగిన స్వేచ్ఛగలది. ఇందులో కుల బహిష్కరణలే వుంటాయి. మత బహిష్కరణలుండవు. కారణం? మన సాంఘిక కుల, కుటుంబ వ్యవస్థల చట్రం చాలా కఠినమైనది. మత విశ్వాసాలు యధేచ్ఛ గలవి. అదే సమయంలో ఈ కుల చట్రం కారణంగా అన్యమతస్తులెవరినీ లోపలికి రానివ్వని ఏక కవాట లక్షణం కూడా దీనికుంది. 'హిందూత్వ' వాదులు మతమార్పిడిపై చేసే ప్రకటనలన్నీ ఈ వాస్తవాన్ని దిగమింగుకోలేని ఆత్మవంచనాత్మకాలే! తమను తాము సంస్కరించుకోలేని భీరు గంభీరాలే!!



## హైకూలు

తొలకరిలో మట్టివాసన
మనసు పూదోటకు ఎరువు
కాంక్రీట్ జంగిల్‌లో
మురుగు వాసనే మనిషికి మిగులు

అశ్లీలం గురించి అనర్గళంగా చెబుతారు
బాక్సాఫీసు దగ్గర పైరవీలు చేస్తారు
విచ్చలవిడిగా ప్రదర్శనలు ఇస్తారు
మహిళల వస్త్రధారణమీద విరుచుకు పడతారు

- బి. సుధా కిరణ్

# దాస్

కథ

- డాక్టర్ శమంతకమణి

శబరి ఎక్స్‌ప్రెస్ స్టేషన్‌లోకి ప్రవేశిస్తు ంది. రైలు వచ్చేసరికి కార్‌తో సిద్ధంగా ఉంటానని నిన్న ఉదయం చెప్పిన దాస్ ఫోన్ ఎంతకీ కలవడం లేదు. వస్తాడో రాడో తెలియదు. కారణం.. ఒక్కసారే పరిచయం. అతన్ని నమ్మి హైదరాబాద్ నుండి బయలు దేరింది లక్ష్మి. గుంటూరులో కలిశారు విజయ, మమత. మూడు కొప్పులు కలిస్తే గొడవలంటారు పెద్దలు. మూడు దశాబ్దాల స్నేహబంధాన్ని కాపాడుకుంటున్న స్నేహితురాలు వీరు. వైవాహిక బంధంతో వేరు వేరు ఊళ్లలో కాపుర ముంటున్నా సంవత్సరానికి నాలుగుసార్లు కలసి ఓ వారం రోజులు గడుపుతారు. చుట్టు పక్కలవారితో సత్సంబంధాలు కొనసాగిస్తూ తమకంటూ సొంత సంపాదన కోసం, ఇళ్ల వద్ద చీరల వ్యాపారం చేస్తారు. కొనుగోలు నిమిత్తం దేశంలో వివిధ ప్రాంతాలకు వెళతారు. కుటుంబాలను విడచి, వంటా వార్పులకు దూరంగా గడిపే కాలం.. వారికి శారీరక, మానసిక విశ్రాంతి.

కొనుగోలు కోసం దూర ప్రాంతాలు వెళ్లడం, హోటల్ లేదా రిటైరింగ్ రూమ్‌లలో మకాం, కారులో కావాల్సిన చోట తిరగడం, నచ్చిన చోట, స్థానిక పదార్థాల రుచి చూడటం... ఇదో ఆటవిడుపు.

కోయంబత్తూరు స్టేషన్‌లో ఆగేది ఐదు నిముషాలే.. దాస్ జాడ లేదు. అందుకే వడివడిగా ట్రైన్ దిగారు. ప్లాట్‌ఫారంపై తేలి వస్తున్న ఘుమఘుమలు, ఆకలిని స్ఫురణకు తెచ్చాయి. కెఫెటేరియాలో ఇడ్లీ, వడ తిని కాఫీ తాగి రిటైరింగ్ రూమ్ చేరారు. ఆన్‌లైన్ బుకింగ్ వలన ఇబ్బంది లేని వసతి. ఖరీదు నామ మాత్రం. సురక్షితం. మరో గంట గడిచింది. కోయంబత్తూర్ రావడం రెండోసారి. మమతకు తమిళం, లక్ష్మికి హిందీ, విజయకు ఇంగ్లీష్ ధారాళంగా వచ్చు. భాష సమస్య కాదు. చేనేత కార్మికులు కొత్తవారికి డైరెక్ట్‌గా అమ్మరు. దాస్ తమకు, వ్యాపారులకు ఓ వారధి.

నిజానికి ఆ రోజు కనీసం ఓ ఐదు వందల కి॥మీ చుట్టిరావాలి, రూ.నాలుగు లక్షలైనా కొనుగోలు చేయాలి. కమీషన్ పద్ధతిపై దాస్ సహకారం లేనిదే సాధ్యం కాదు. చూస్తుండగానే మిట్ట మధ్యాహ్నం అయింది. ఇక దాస్ రాడని నిర్ణయించుకున్న ముగ్గురూ పెయిడ్ ఆటోలో మెయిన్ బజార్ చేరారు.

వరుసగా దుకాణాలు. హోల్‌సేల్, రిటైల్ కోయంబత్తూరు చేనేత వస్త్రాలు. చేతితో నేసిన పట్టు, కాటన్ చీరెలు నాణ్యతతో, సరసమైన ధరలకు దొరుకుతాయి. మోసం ఉండదు. ఎదురుగా ఉన్న ఓ పెద్ద షాపులోకి అడుగుపెట్టారు. అవి కేవలం ఆరుగజాల తాను ముక్కలు కాదు. ఆకలి కడుపులు నింపుతూ, ఆడవారి సౌందర్యాన్ని ఇనుమడింపచేసే సుంద వస్త్రాలు. హస్త నైపుణ్యానికి ప్రతీకలు. లగేజి సాయంత్రం తీసుకుంటామని మరో షాప్ లోకి ప్రవేశించారు. దూరాభారాల నుంచి వచ్చే వినియోగదారులను మోసం చేసే సంస్కృతి కాదు. వ్యాపారానికైనా, మోసానికైనా, ప్రేమకైనా పునాది నమ్మకం. నమ్మకమే ఆధారంగా సాగుతోంది దశాబ్దాలుగా వ్యాపారం.

భోజనం చేస్తుండగా వచ్చింది దాస్ ఫోన్. తన బాల్య మిత్రుడి వ్యాన్‌తో వస్తున్నానని, దారిలో రిపేర్ రావడం, సిగ్నల్ లేని ప్రదేశంలో ప్రయాణం వలన ఫోన్ చేయలేక పోయానని కోపంతో ఉన్న ముగ్గురికీ ఓ ఉపశమనం. కనీసం మధ్యాహ్నమన్నా చుట్టుపక్కల పల్లెటూళ్లు తిరగ వచ్చని ప్లాన్ వేసుకుంటున్న సమయంలో "నమస్కారమమ్మా" అంటూ వచ్చాడు. భోజనం చేయమన్న వాళ్ల మాట మన్నించలేదు.. కారణం అప్పటికే ఆలస్యమయిందని.

వ్యాన్‌లో ప్రయాణం ఆరంభమయ్యింది. రాత్రి ట్రైన్‌లో సరైన నిద్ర లేని కారణాన కునుకుపట్టింది ముగ్గురికీ. వ్యాన్ సడన్‌గా ఆగింది. కళ్లు తెరిచిన ఆ ముగ్గురికీ బ్యాగ్ నిండా అరటిపళ్లతో కిందకు దిగుతున్న దాస్ కనబడ్డాడు. రోడ్డు పక్కనే ఓ ఇల్లు. దాదాపు పది

గేదెలు. రెండు ఆవులు, ఒక్కొక్కదాని మోర సవరదీస్తూ, పండిన అరటిపళ్లను వాటి నోటిలో పెట్టసాగాడు. బ్యాగ్ ఖాళీ అయ్యింది. వచ్చి కారెక్కాడు. కారు ఓ గ్రామం చేరింది. ముందే చెప్పడం వలన స్టాక్‌తో రెడీగా హాల్‌లో కూర్చుని ఉన్నారు ఆడవాళ్లు. మగవాళ్లు మగ్గం నేతలో, దూరాభారాలకు లగేజీతో వెళు తూ ఉంటారు. ఆడవాళ్లు ఇంటిలోనే అమ్మకాలతో పాటు ప్యాకింగ్‌లు చేస్తూ సహాయం చేస్తారు. ప్రత్యేకంగా గోడౌన్ లుండవు. తాజా సరుకు.

తలో రూ. 2 లక్షల సరుకు కొనుగోలు చేశారు. "డబ్బా? చెక్కా?" అనడిగిన వారికి "మీ యిష్టం" అన్న సమాధానం వచ్చింది. ఓ లక్ష రొఖ్ఖం, ఓ లక్ష చెక్ చొప్పున ఇచ్చి బయలు దేరారు. చీరెలు జాగ్రత్తగా ప్యాక్ చేయించి వ్యాన్‌లో పెట్టించాడు దాస్.

మొత్తానికి ఓ నాలుగు గ్రామాలు తిరిగి రాత్రి పదిగంటలకు రూమ్ చేరారు. డ్రైవర్, దాస్ బ్యాగ్‌లు లోపల పెట్టి, ఉదయం 7 గంటల కల్లా రెడీ అవ్వమని చెప్పి వెళ్లిపోయారు. రూమ్ తీసుకుంటే ఖర్చు అవుతుందని, స్టేషన్‌లోని పేజ్ అండ్ యూజ్ బాత్రూమ్‌లో పార్కింగ్‌లో జీప్‌లోనే నిద్రపోయారు మిత్రులిద్దరూ.

ఉదయాన్నే, పరిశుభ్రంగా మొహం నిండా అడ్డబొట్టుల విభూతితో ప్రత్యక్షమయ్యారు. ప్రయాణం ఆరంభ మయ్యింది. స్నేహితులు ముగ్గురూ టిఫిన్ చేస్తుండగా ఓ పెద్ద పెట్టెలో ప్రత్యక్షమయ్యారు దాస్ మరో స్నేహితుడు. పెట్టెనిండా మగ్గిన అరటిపళ్లు. పీకలవరకూ కోపం వచ్చింది ముగ్గురికీ. ముందురోజు కథే పునరావృతం... పశువులు కనబడటం, కార్ ఆగిపోవటం. అరటిపండ్లు తింటున్న పశువుల్ని తన్మయత్వంతో చూస్తున్న దాస్ ని మెత్తగా తన్నాలనిపించినా తమాయించు కున్నారు.

మూడో రోజూ అదే తంతు. కోపం ఆగని లక్ష్మి "దాస్! నీ సంపాదన ఎంత"?

"మీరు కొనే వాటిపై రెండు శాతమమ్మా"! "అంటే రోజుకి రెండు నుంచీ ఐదువేలు"

రోజూ ఉండదమ్మా ఎప్పుడో వస్తారు మీకు లాగా సంవత్సరానికి ఒకటి లేదా రెండుసార్లు అంటూ కార్ ఆపించి అరటిపళ్లతో దిగాడు దాస్. నికరా దాయం లేని దాస్‌కి ఈ అలవాటు ఏంటి? డ్రైవర్‌ని అడిగింది విజయ. "కుటుంబం ఏమీ అనదా?" ప్రశ్నించింది మమత.

తల్లీ దండ్రీ, తోడబుట్టిన వాళ్లు, భార్య, ఇద్దరు బిడ్డలు.. తీర్థయాత్రలకు వెళ్లి వస్తున్న బస్సు లోయలో పడి అందరూ తిరిగిరాని లోకాలకు వెళ్లిపోయారు. ఆ దు:ఖం నుండి బయటకు రావడానికి చాలా కాలమే పట్టింది. అదే సమయంలో భాగ స్వాములు వ్యాపారంలో మోసం చేశారు. ఇల్లు అమ్మేసి, అప్పులు తీర్చేసి, మధ్యతరగతి మనిషి కాస్త కమీషన్ వ్యాపారంతో బతికే సామాన్యు డయ్యాడు".

డ్రైవర్ చెప్పిన గతం విన్న ఆ ముగ్గురి హృదయాలు ద్రవించాయి. "స్వంత ఇల్లు లేక, సరైన ఆదాయం లేక, తన కడుపు మాడ్చుకుంటూ... సంపాదన పశువుల పాల్జేయటం అంత అవసరమా?" అడిగింది మమత.

"మమతాను బంధాల విలువ తెలిసిన మనిషి. నమ్మిన వారే మోసం చేయడం వలన మనుష్యుల కన్నా మాటలు రాని మూగజీవులే మేలనుకున్నాడు. అందుకే సంవత్సరంలో అన్ని రోజులూ మూగజీవుల ఆకలి తీరుస్తూనే ఉంటాడమ్మా తన మిత్రుడు రాక గమనించి మాటలాపేశాడు డ్రైవర్. సామాన్యంగా ఉంటూ తమ చిరాకుకు కారణమైన దాస్ వలన తమ సమయం వృధా అయిందని భావించిన ఆ స్నేహితు రాలు మనసులో సిగ్గుపడ్డారు.

పార్సిల్స్ గట్టిగా చేయించి, లారీ ఆఫీస్‌లో వేయించి, ముగ్గురినీ ట్రైన్ ఎక్కించడానికి వచ్చిన దాస్ చేతిలో ఒక్కొక్కరూ 5వేలు చొప్పున ఓ కవర్‌లో పెట్టి అందించారు.

కవర్ తెరచి చూసిన అతను... "అమ్మా ఒంటరివాడిని నాకెందుకీ సొమ్ము. నేనున్నంతవరకూ "కోవై"లో పశువులకు లోటుండదమ్మా.. ఈ డబ్బుని మీ ప్రాంతంలో మూగజీవుల ఆకలి తీర్చండి" అంటూ తిరిగి ఇచ్చినతనికి చేతులెత్తి నమస్కరించారు. దూర ప్రాంతాల నుండీ డబ్బుతో వచ్చిన తమను సురక్షితంగా తిరిగి పంపడమే గాక ఓ సత్కార్యానికి పురిగొల్పిన దాస్ సామాన్యుడా! మాన్యుడా!

# ఆర్భాటంలేని ఆదర్శ వివాహాలను ఆదరించాలి

వ్యాసం

- పి.రమాదేవి

భారత దేశంలో పెళ్లంటే ఆకాశమంత పందిళ్లు, హంగులు, ఆర్భాటాలు, పంచభక్ష పరమాన్నాలు.... జీవితంలో ఒక్క సారే కదా. చేసుకునేది అంటూ ఎక్కడ లేని విపరీతమైన ఖర్చులు. ఇక సంప్రదాయాల పేరుతో ఇచ్చి పుచ్చుకొనేవి ఎన్నో! కానీ పెళ్లంటే రెండు మనసులు ఒక్కటవ్వడం... కొన్ని వందల మనసులకు సంతోషాన్ని పంచడం అని నిరూపించింది నాగ్‌పూర్‌కు చెందిన ఓ జంట.

అభయ్ దివారే... ఇటీవలే ఇండియన్ రెవెన్యూ సర్వీస్ (ఐ.ఆర్.ఎస్)కి ఎంపికయ్యాడు. నాగ్‌పూర్ బేస్డ్ నేషనల్ ఆకాడమీ ఆఫ్ డైరెక్ట్ టాక్సెస్ (ఎన్ఏ డీటీ) లో ట్రైనింగ్‌కు వెళ్లనున్నాడు. ప్రీతి కుంబారే ఐడీబీఐ ముంబై బ్రాంచ్‌లో అసిస్టెంట్ మేనేజర్‌గా పని చేస్తోంది. ఇద్దరూ యూపీఎస్సీ, ఎంపీఎస్సీ పరీక్షల కోసం సన్నద్ధమౌతుండగా పరిచయమయ్యారు. ఆ పరిచయం కాస్తా ప్రేమకు దారితీసింది.

రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఫీల్డ్ విజిట్‌లో ఉన్నప్పుడు ఆయనను కలిశాడు అభయ్. "సామాజిక, ఆర్థిక మార్పుకోసం ఏజెంట్లుగా పని చేయండి" అన్న ఆయన పిలుపునందుకున్నాడు.

**పెళ్లి ఖర్చుపై పరిశోధన....**

ఇద్దరూ పెళ్ళిచేసుకోవాలనుకున్నప్పుడు.... అసలు పెళ్లిళ్ల ఖర్చు మీద పరిశోధన చేయాలనిపించింది. గణాంకాలు తీయడం మొదలుపెట్టారు. తీరా చూసి షాకయ్యారు. భారత దేశంలో ఏటా రూ. లక్ష కోట్లు పెళ్లిళ్ల కోసం ఖర్చు చేస్తున్నారు.

మన దేశ బడ్జెట్ రూ.16 లక్షల కోట్లు. ప్రజల జీవన విధానంలో చాలా తేడా వుంది. అయినా కూడా పెళ్లికి మాత్రం ప్రతి ఒక్కరూ వాళ్ల స్థాయిని బట్టి రూ.3 లక్షల నుంచి రూ.5 కోట్ల వరకూ ఖర్చు చేస్తున్నారు. పేదరికంలో ఉన్న కుటుంబాలు



ప్రీతి కుంబారే అభయ్ దివారే...

అప్పుల బారిన పడుతున్నాయి. పెళ్లిళ్ల కోసమే ఆస్తులు అమ్ముకుంటున్నవారెందరో. విదర్భలాంటి చోట్ల రైతులు ఆత్మ హత్యలకు పెళ్ళిళ్ల ఖర్చులు కూడా కారణమవుతున్నాయి. పిల్లలకు ఘనంగా పెళ్లి చేయాలన్న తపన వారిని అప్పుల ఊబిలో పడేస్తోంది. దాంట్లోంచి బయటపడలేక ఆత్మహత్య చేసుకుంటున్నారు.

అభయ్, ప్రీతిల గ్రామాల్లో సైతం ఇది పెద్ద సమస్యగా ఉంది. అందుకే పెళ్లి విధానంలో మార్పు తీసుకురావాలనుకున్నది ఈ జంట. అందుకు ఇరు కుటుంబాల పెద్దలూ సహకరించారు. అంతేకాదు, ఆత్మహత్య చేసుకున్న రైతుకుటుంబాలను శోధించే పనీ వాళ్లే చేశారు.

అంబేద్కర్ విగ్రహం సాక్షిగా... 10/7/216న ఇద్దరూ అమరావతిలోని అభియంత భవన్‌లో పెళ్లి చేసుకున్నారు. ఆ పెళ్లిలో భాజా భజంత్రీలు లేవు, హంగులు, ఆర్భాటాలు అసలే లేవు. సాదాసీదాగా... "పేబ్యాక్‌టూ సొసైటీ" క్యాప్షన్‌తో ఒక్కటయ్యారు.

అయితే పెళ్లికయ్యే ఆ ఖర్చునే మరో విధంగా ఉపయోగించాలనుకుంది ఆ జంట. ఆత్మహత్య చేసుకున్న పది రైతు కుటుంబాలను ఎంచుకొని... ఒక్కో కుటుంబానికి రూ. 20 వేల చొప్పున డొనేట్ చేశారు. అంతేకాదు రూ.52 వేల విలువ చేసే వివిధ పోటీ పరీక్షల పుస్తకాలను అమరావతిలోని ఐదు లైబ్రరీలకు ఇచ్చారు. అయితే ఈ డబ్బంతా వాళ్ల తల్లి దండ్రుల దగ్గర నుంచి తీసుకోలేదు. అమ్మాయి, అబ్బాయి కష్టపడి సంపాదించిన సొమ్మునే ఇలా వివిధ పనులకు ఉపయోగించారు. విందులో కూడా చపాతి, అన్నం, పప్పు, కూరగాయలు మాత్రమే వడ్డించారు. పెళ్లిలో ఎలాంటి సంప్రదాయాలను అనుసరించ లేదు. సింపుల్‌గా స్టేజ్‌పై రిజిస్టర్ మ్యారేజ్ చేసుకున్నారు. అనేక మంది సామాజిక

ఉద్యమకారులు పాల్గొని వధూవరులను ఆశీర్వదించడం ఈ పెళ్లి ప్రత్యేకత.

"చదువుకుకున్న యువత కూడా ఇలాంటి పనులు చేయకపోతే చదువుకు అర్థమే లేదు. ఇది ప్రతి ఒక్కరు తెలుసుకో గలగాలి. ప్రతి ఒక్కరూ సామాజిక బాధ్య తతో వ్యవహరించాలి" అని చెబుతున్న ఈ జంట నేటి యువతకు మార్గదర్శకం.

ఆంధ్ర కేడర్‌కు చెందిన విజయవాడ సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ డాక్టర్ సలోని సిదనా, మధ్యప్రదేశ్ కేడర్‌కు చెందిన ఆశిష్ వశిష్టల పెళ్లి 2016 నవంబర్ 29న కేవలం రూ.500 ఖర్చుతో జరిగింది. ఆదర్శంగా వివాహం చేసుకోవడమే కాకుండా సహోద్యోగులకు మిఠాయిలు పంచి అదే రిసెప్షన్ అనుకోమన్నారు. అట్టహాసంగా జరిగే పెళ్లిళ్లకు కోట్లాది రూపాయలు దుబారాకు తాము వ్యతిరేక మని ఈ జంట నిరూపించింది. అంతే కాకుండా డా. సలోని సిదానా పెళ్లి చేసుకున్న 48 గంటల్లోనే డ్యూటీలో చేరారని కృష్ణాజిల్లా కలెక్టర్ ఏ. బాబు చెప్పారు.

సమాజంలో మార్పు కోరుకునే ప్రతి ఒక్కరూ ఆర్భాటం లేని ఇలాంటి ఆదర్శ వివాహాలు చేసుకున్న జంటలను ఆదరించి అభినందించాలి.

రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కూడా ఈ రకంగా ఆర్భాటం లేని ఆదర్శ వివాహాలు చేసుకున్న జంటలను అభినందించి, ప్రత్యేక ప్రోత్సాహకాలు ప్రకటించాలి.

మీడియా కూడా ఆర్భాటంలేని ఈ విధమైన ఆదర్శ వివాహాలను పదేపదే చూపించి, ప్రత్యేక ఇంటర్వ్యూలు ఇప్పించి యువతను ఆలోచింపచేయగలగాలి. సమాజ మార్పునకు తోడ్పడగలగాలి.

ఇటీవల ప్రధాని నరేంద్రమోదీ నోట్ల రద్దు తరువాత, అధికారంలో ఉన్న ప్రముఖ రాజకీయ నాయకులు వారి కుమార్తెల, కుమారుల వివాహాల సందర్భంగా దాదాపు రూ.500 కోట్లు అంతకుపైచిలుకు ఖర్చు చేశారు. కానీ సామాన్య మానవులు కేవలం రూ.2 లక్షలు లేక వివాహాలు వాయిదా




వేసుకున్న ఉదంతాలు గమనించాం. దీని మూలాలను సామాన్యులు అర్థం చేసుకోవాలి.

అసలు వరకట్న నిషేధచట్టం 1961 లో వచ్చింది. ఆ తర్వాత 1968లో ఈ చట్టం అమలుకి కేంద్రం కొన్ని సవరణలు చేసింది. అలాగే 1998లో రాష్ట్రం కొన్ని నియమాలను రూపొందించింది.

**ఈ చట్టం నియమాల ప్రకారం:-**

1. వరకట్నం అనేది సామాజిక దురాచారమే కాకుండా, నేరం కూడా.

2. కట్నం తీసుకోవడం, ఇవ్వడం కూడా నేరం. తీసుకోవటానికి ప్రోత్సహిం చడమూ నేరం.

3. కట్నం కాకుండా లాంఛనాల పేరుతో జీవితాల్ని నాశనం చేసుకోకుండా వివాహ తంతుని నిరాడంబరంగా చేయాలని సూచించాయి. దాని ప్రకారం పెళ్లి ఖర్చు 15 వేల రూపాయలకు మించ కూడదు.

4. 25 మంది కంటే (11మంది బ్యాండ్ వాళ్లు, పిల్లలు మినహాయించి) ఎక్కువ మంది ఊరేగింపులో పాల్గొన కూడదు.

5. అమ్మాయికీ, అబ్బాయికీ ఒక్కొక్కరికి 75 మించి బహుమతులు ఇవ్వకూడదు. (బహుమతులు ఒక్కోటి రూ.200 కు కూడ మించరాదు).

6. ప్రతి ప్రభుత్వ ఉద్యోగి తను కట్నం తీసుకోలేదని ఆఫిడవిట్‌ను సమర్పించాలి.

7. ఈ బహుమతుల వివరాలు ఇరువైపు వాళ్లు సంతకాలు చేసి ఆ వివరాలను వరకట్న నిషేధ కార్యాలయానికి సమర్పించాలి.

8. వరకట్న నిషేధ అధికారిని ప్రభుత్వం నియమించింది.

మరి చట్టంలో ఉన్న ఈ నియమాలను తుంగలో తొక్కి రూ.కోట్ల ఖర్చుతో పెళ్లిళ్లు చేస్తున్న రాజకీయ నాయకులను, ప్రము ఖులను ఏమనాలి? చట్టాన్ని బహిరంగంగా ఉల్లంఘిస్తున్న వారికి శిక్షలు లేవా?

అలాగే మన సెలబ్రిటీలు వరి పెళ్లిళ్లు, వారి పిల్లల పెళ్లిళ్లకు మెహిందీ అని, సంగీత్ అని ఇంకా అనేక రకాల పేర్లతో ఆర్భాటం చేస్తుంటే వాటిని మీడియా వాళ్లు లైవ్‌లో పదేపదే చూపించి యువత ఆలోచనలను కలుషితం చేస్తుంటే వీటిమీద నియంత్రణ అవసరం లేదా?

సమకాలీనం

# పితృస్వామ్యాన్ని బద్దలు కొడదాం

-పింగళి చైతన్య

'జ్ఞానఫలం' కావాలనుకున్న అవ్వకి శాపం ఇచ్చిన రోజు నుంచే, సీతకి శీల పరీక్ష చేసిన రోజు నుంచే... మాకు తెలుసు. ఏ సమాజం, ఏ సంస్కృతి, ఏ మతం, ఏ దేశం కూడా.. స్త్రీల తరపున నిలబడలేదని. శతాబ్దాలుగా జరుగుతున్న హింసకి, తాజాగా బెంగుళూరు సీసీ కెమెరాల్లో సాక్ష్యం దొరికింది. రాత్రి పూట ఆడపిల్లలు రోడ్డు మీద ఎందుకు తిరుగుతున్నారు?' అని కొందరు. 'పాశ్చాత్య సంస్కృతికి చెందిన వస్త్రధారణే కారణం' అని కొందరు. 'మగవాళ్ళంతా అలాంటి వారు కాదు' అని కొందరు. పోలీసు అధికారులు. నాయకులతో సహా 'ఓ...' అంటూ తెగ చెబుతున్నారు. బెంగుళూరులో జరిగిన వికృత చేష్టలని కేవలం 'ఒకానొక నేరం'గా చూడటం. ఆ నేరస్థుల్ని శిక్షించటంతో... సమస్య తీరిపోదు. మనం పాటిస్తున్న ద్వంద్వ ప్రమాణాల్లో సమస్య ఉంది. మన సమాజం, మన కుటుంబ వ్యవస్థ.

మన విద్యా వ్యవస్థ. మొత్తంగా మన సంస్కృతిలో ఉంది. నాలుగేళ్ల పసిపాపల మీద కూడా జరుగుతున్న రేప్‌లకి ఏమిటి కారణం? వాళ్లేం బట్టలు వేసుకుంటారు? పాశ్చాత్య వస్త్ర ధారణే కారణం అనే మహానుభావులు దీనికి సమాధానం చెప్పాలి. బ్రాహ్మణేతర స్త్రీలకి పైట వేసుకునే హక్కును నిరాకరించిన కేరళ అగ్రకుల ఉన్మాద సంస్కృతేగా... భారతీయ సంస్కృతి.

పోనీ ఆ బ్రాహ్మణ వ్యవస్థ ఆ కులంలో పుట్టిన స్త్రీలకి ఏం చేసిందో 'కన్యాశుల్కం' చదివితే తెలుస్తుంది. పసిపిల్లని డబ్బుకు ఆశపడి ముసలి వాడికిచ్చి పెళ్లిచేసి, అతను చస్తే.. పచ్చడి జాడీకి చుట్టినట్లు తెల్ల గుడ్డ చుట్టటమేగా.. భారతీయ సంస్కృతి, చెంగుతో మొహమంతా కప్పి బాల్య వివాహాలు, సతీ సహగమనాలు చేయించటమేగా... భారతీయ సంస్కృతి. బస్తర్లో, ఈశాన్య భారతదేశంలో, కాశ్మీర్లో, ఆదివాసీ,



ముస్లిం, ఇతర మైనారిటీ స్త్రీలని రేప్ చేయటమేగా భారతీయ సంస్కృతి. పారిపోయి అగ్రకుల అబ్బాయిని పెళ్లి చేసుకుందని, ఆ దళిత స్త్రీ చెల్లిని నగ్నంగా నిలబెట్టిన ఘటన. 2016లోనే జరిగింది. ఇదేగా భారతీయ సంస్కృతి. ఆడపిల్ల పెళ్లి వయసు 18, మగపిల్లవాడి పెళ్లి వయసు 21గా చట్టం ఉన్న ద్వంద్వ ప్రమాణాల సంస్కృతి మనది.

పోనీ భారతీయ స్త్రీలని పాడు చేస్తోంది అంటున్న... ఆ పాశ్చాత్య సంస్కృతిలో స్త్రీలు ఎలా ఉన్నారు? ఆఫ్రో అమెరికన్ (నల్ల జాతీయులు) స్త్రీల మీద జరుగుతున్న రేప్‌లకి, యూరప్‌లో జరిగిన మాస్ రేప్‌లకి, సిరియా, మధ్య ఆసియా దేశాల్లో జరుగుతున్న రేప్‌లకి ఎవరు బాధ్యులు? 'ఇక్కడి' పితృస్వామ్య నెపాన్ని పాశ్చాత్య సంస్కృతి మీద వేస్తే, 'అక్కడి' పితృస్వామ్యం వలసవచ్చి స్థిరపడిన వాళ్ల మీదకి నేరాన్ని తోసింది. ఇక్కడి పితృస్వామ్యం నడుము కనిపించినా సరే, స్త్రీలు చీరని ధరించాలని నిర్ణయిస్తుంటే.

కాళ్లు కనిపించినా సరే, నడుము కనిపించకూడని వస్త్రధారణ కొన్ని దేశాల్లో, మోకాళ్లు అసలు కనిపించకూడదని వస్త్రధారణ కొన్ని దేశాల్లో.. తమకి తోచిన వస్త్రధారణ అక్కడి పితృస్వామ్యం స్త్రీలకి నిర్దేశించింది. భారతీయ పురుషులు లుంగీలు, పంచెలు వదిలి.. ఫ్యాంట్, షర్టు, షార్ట్‌లోకి మారే హక్కు ఉంది కానీ, స్త్రీలకి లేదు మరి ఎంచేతనో? అర్ధరాత్రి వరకు పబ్‌లలో వాళ్లు తాగి, డ్రంక్ అండ్ డ్రైవ్ కేస్‌లో పట్టుబడొచ్చు. కానీ.. స్త్రీలు ఇంట్లో కూర్చొని కూడా తాగకూడదు. ఈ ద్వంద్వ ప్రమాణాలేంటి? మగవాళ్లు అందరూ అలాంటి వాళ్ళు కాదు. 'నాట్ ఆల్ మెన్' అని గింజుకుంటున్న దొరలూ, ఈ దేశంలో స్త్రీల ఇంటి పేర్లు ఎవరివి? జనాభాలో స్త్రీ పురుషుల నిష్పత్తిలో ఇంత తేడా ఎందుకుంది? కట్నం ఇవన్నీ, స్త్రీ పురుషుల

సమానత్వానికి ముడిపడి ఉన్న విషయాలు అని తెలిసింది ఎందరికి?

అన్ని దేశాల్లో, అన్ని మతాల్లో, అన్ని సంస్కృతుల్లో.. పితృస్వామ్యం మనుషుల్ని కుక్కలుగా చేస్తుంది. (కుక్కలకి నా క్షమాపణలు). కాస్తంత చర్మం కనిపిస్తే నిలవలేని బలహీనుడు అంటోంది. తినటం తప్ప వండలేని అసమర్థుడిని చేస్తోంది. ఏద్చే స్వేచ్ఛని లేకుండా చేసింది. 'ఆకు వచ్చి ముల్లు మీద పడ్డా, ముల్లు వచ్చి ఆకు మీద పడ్డా ఆకుకే నష్టం' అనే సామెత మాటున.. మగవాళ్లని డ్రాకులాల మాదిరి చిత్రిస్తోంది. మార్చేస్తోంది.

అందుకే, మగవాళ్లు కూడా మనుషులే అని నిరూపించేందుకు ముళ్లు, డ్రాకులాలు, రాముడు, రావణుడు, మృగాలు కాదు అని నిరూపించాలి అంటే. 'నాట్ ఆల్ మెన్' అని కాదు. 'పితృస్వామ్యాన్ని' బద్దలు కొడదాం అని నినదించాలి. ఆ దిశగా పని మొదలుపెట్టాలి. అంతే తప్ప 'భారతీయ సంస్కృతి' అంటూ మా మీద ఆంక్షలు విధిస్తే, భారతీయ తాళపత్ర గ్రంథాలకి పట్టిన గతే పడుతుంది.



ఆరోగ్యం

# వరుసగా అబార్షన్‌లకు కారణాలు

-డా॥ ఎం.రమాదేవి

పిండం ఆరోనెలకు ముందు లేదా 500 గ్రాములు బరువులోపు ఉండి పడిపోయినప్పుడు గర్భస్రావం లేదా అబార్షన్ అంటారు. వరుసగా 2, 3 సార్లు అలా జరిగినప్పుడు కారణాలను విశ్లేషించాల్సుంటుంది.

సాధారణంగా ఎప్పుడైనా ఒకసారి గర్భస్రావం 50 శాతం మంది మహిళల్లో జరిగే అవకాశం ఉంటుంది. దీనికి చాలా కారణాలుంటాయి. పిండం తయారీలో లోపం అన్నింటికన్నా ముఖ్యం. ఈ లోపాలు ఉన్నప్పుడు సహజంగానే ఎదుగుదల ఆగి గర్భస్రావమవుతుంది. జన్యుపరమైన కారణాలూ గర్భస్రావానికి కారణమవ్వొచ్చు. ఒకసారి గర్భస్రావం అయితే కంగారుపడాల్సిన అవసరం లేదు. వరుసగా ఎక్కువసార్లు గర్భస్రావం జరిగితే మాత్రం కొన్ని పరీక్షలు చేయించుకోవాలి.

**వివిధ కారణాలు :**

**తల్లి వయసు** : 20 నుంచి 24 ఏళ్ల వయస్సు గర్భం దాల్చడానికి అత్యంత అనువైన వయసు. వయసు పెరిగేకొద్దీ అండాల నాణ్యత కూడా తగ్గుతూ ఉంటుంది. ఇలాంటి అండాల వల్ల గర్భం దాల్చే అవకాశాలు తగ్గుతాయి. గర్భస్రావం, పిండంలో లోపాలు తలెత్తే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. అందుకే కనీసం 30



ఏళ్ల వయసుకి చేరుకునే లోపలైనా మొదటి బిడ్డకు జన్మనివ్వటం అన్ని విధాలా శ్రేయస్కరం.

**జన్యుపరమైన కారణాలు :** భర్త నుంచి సంక్రమించిన జన్యువుల్లో లోపాలు మొదటి మూడు నెలల్లో జరిగే అబార్షన్లకు ప్రధాన కారణం. కనీసం 50 శాతం గర్భస్రావాలకు ఇవే కారణం. జన్యుపరమైన లోపాలు కలిగిన పిండం ఎదగకుండా ఇది ఒక రకమైన రక్షణ చర్య అని చెప్పవచ్చు.

**గర్భసంచిలో లోపాలు:** గర్భాశయ ముఖద్వారం వదులుగా ఉండొచ్చు. ఈ సమస్య పుట్టుకతో రావొచ్చు లేదా వరుస అబార్షన్లు, ఇబ్బందికరమైన ప్రసవాల ఫలితంగా కూడా జరగవచ్చు. ఇలాంటప్పుడు ఆ ప్రదేశంలో కుట్లు వేసి పరిస్థితిని సరిచేస్తారు. పిండానికి ఇన్‌ఫెక్షన్లు సోకకుండా గర్భాశయ ముఖద్వారం (సర్విక్స్) కాపాడబడుతుంది. అది వదులు అయినప్పుడు గర్భకోశానికి, పిండానికి సోకే ఇన్ఫెక్షన్ల వల్ల కూడా నొప్పులు ముందే మొదలై గర్భస్రావం జరగొచ్చు.

గర్భాశయం లోపలిపొర: ఇతర ఎలాంటి కారణాలు లేనప్పుడు కేవలం గర్భాశయం లోపలి పొరకు మధ్యలో సెప్టమ్

(అడ్డంకి) ఉండొచ్చు. దీనివల్ల గర్భాశయంలో పిండం నాటుకోడానికీ నాటుకున్న పిండం పెరగడానికీ సెప్టమ్ అడ్డుపడుతుందని తెలిసినపుడు, వైద్యులు ఆపరేషన్‌తో దాన్ని తొలగిస్తారు.

**కణతులు** : వీటినే ఫైబ్రాయిడ్స్ అంటారు. గర్భసంచిలో ఇవి ఉన్న ప్రదేశాన్ని బట్టి గర్భస్రావం అయ్యే అవకాశం ఉంటుంది. గర్భకోశం లోపలి వైపు ఉంటే పిండం ఎదగటానికి సరైన రక్తప్రసరణ జరగదు. దీనితో ముందే నొప్పులు రావచ్చు. ఇవే కణతులు గర్భకోశానికి బయటి వైపు ఉన్నప్పుడు ఇలా జరిగే అవకాశం మరింత ఎక్కువ.

**ఇతర కారణాలు:** క్షయ లాంటి జబ్బులు, అనేకసార్లు గర్భం తీయించుకోవటం లాంటి వాటివలన గర్భసంచిలో అనవసరమైన పొరలు ఏర్పడతాయి. ఈ పొరలు రక్త ప్రసరణను అడ్డుకుంటాయి. వీటిని హిస్టరోస్కోపి ఆపరేషన్ ద్వారా తొలగిస్తారు. థైరాయిడ్ గ్రంధి పనితీరులో లోపాలు, పాలిసిస్టిక్ ఓవరిసిండ్రో (పి.సి.ఒ.డి) మధుమేహం లాంటి వ్యాధులున్నా అబార్షన్లు కావొచ్చు. రక్తం గడ్డకట్టడంలో తేడాలు ఏపిఎల్ఏ సిండ్రోం (అప్లాసిండ్రోమ్), ధూమపానం, మానసిక ఒత్తిడి లాంటివి కూడా గర్భస్రావానికి కారణం కావొచ్చు.

**అప్లా సిండ్రోమ్:** ఈ సమస్య ఉన్న గర్భిణుల్లో కొన్ని యాంటీబాడీస్ తయారవుతాయి. ఇవి శరీరంలోని యాంటీజెన్సినే శత్రువులుగా భావించి రిజెక్ట్ చేస్తాయి. దానితో అబార్షన్ అవుతుంది.

**ధూమపానం :** పొగ తాగే అలవాటున్న భర్తల వల్ల ప్యానివ్ స్మోకర్లవుతారు. ఆమెతో పాటు, గర్భంలోని బిడ్డ కూడా స్మోకింగ్ ప్రభావానికి గురవుతుంది.

**కారణాలను కనిపెట్టి వైద్యంతో సరిజేయాలి:** ఆల్ట్రా సౌండ్ స్కానింగ్ ద్వారా గర్భాశయం, అండాశయాల ఆకారం, పరిణామం తెలుస్తుంది. అండాశయాల్లో పాలిసిస్టిక్ ఓవరీస్ ఉంటే దానికి చికిత్స చేయాలి. లేకపోతే వీటివల్ల హార్మోన్లలో వ్యత్యాసం వచ్చి అబార్షన్లకు దారితీస్తుంది. గర్భాశయంలో ఇబ్బందులు, సమస్యలు ఉన్నపుడు వాటిని ఆపరేషన్ ద్వారా సరిజేస్తారు. దీనినే హిస్టరోస్కోపీ అంటారు. అలాగే గర్భాశయంలో కణతులు, లోపలి పొరలో సెప్టం లాంటివి కూడా తొలగిస్తారు.

గర్భస్రావం పదే పదే కావడానికి కారణాలు గమనించి సమర్థవంతమైన చికిత్స అందిస్తే ప్రతి స్త్రీ పండంటి బిడ్డకు జన్మనివ్వగలుగుతుంది.



మణిపూసలు

# సుచేతాకృపలాని

- వకుళాభరణం లలిత

పితృస్వామ్యంలో ఒక రాష్ట్రానికి మహిళ ముఖ్యమంత్రి కావటం చాలా అరుదు. అందు లోనూ మగవాళ్ళ కనుసన్నల్లో కదిలే రాజకీయ ఎత్తుగడల మధ్య సుచేత ముఖ్యమంత్రి పదవిని సాధించారు. 1963 నుంచీ 1967 వరకూ ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రిగా ఎంతో పేరు సంపాదించారు.

సుచేతకృపలాని 1908 జూన్ 1వ తారీఖున జన్మించి 1974 డిసెంబరు వరకూ భారతీయ స్వాతంత్ర్య సమర యోధురాలిగా, రాజకీయ నాయకురాలిగా చెలామణి అయి నారు. పంజాబ్‌లో అంబాలా అనే ఊరులో బెంగాలీ బ్రహ్మసమాజ కుటుంబంలో జన్మించారు. పంజాబ్‌లో అంబాలా అనే ఊరులో బెంగాలీ బ్రహ్మసమాజ కుంటుంబం లో సన్మించారు. పంజాబ్ విశ్వవిద్యాలయంలో ఇంద్రప్రస్థ కళాశాల్లో చదివారు. రాజ్యాంగ సంబంధిత చరిత్రలో ఆచార్య పదవిని స్వీకరించి 1936లో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఆచారిణి అయ్యారు. భారత జాతీయ కాంగ్రెస్ సభ్యుడైన ఆచార్య కృపలానీని వివాహమాడారు. ఆమెకన్నా భర్త 20 సంవత్సరాలు పెద్ద. రెండు కుటుంబాల వారూ ఆ వివాహాన్ని అంగీకరిం చలేదు. మొట్టమొదట గాంధీ గారు కూడా వ్యతిరేకిం చారు. అయినా, పట్టువదలని విక్రమార్కుడిలా ఎదిరించి ఆయన్ను వివాహం చేసుకున్నారు.

కస్తూర్బా నేషనల్ మెమోరియల్ ట్రస్ట్ నిర్వాహక కార్యదర్శిగా గాంధీ ఆమెపై బాధ్యతను పెట్టారు. ఆ బాధ్యతను త్రికరణ శుద్ధిగా స్వీకరించి, తన మీద పెట్టిన నమ్మ కాన్ని నిలబెట్టుకొన్నారు. గాంధీజీ, కస్తూర్బా గాంధీకీ అత్యంత సన్నిహితురాలు. భారత జాతీయ కాంగ్రెస్‌లో పనిచేస్తున్నప్పటికీ కాంగ్రెస్ అండతో ఎదగలేదు. తనకు తానుగా తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్న మహిళా కాంగ్రెస్ నాయకురాలు సుచేతాకృపలానీ. ఆచార్య కృపలానీకి నెహ్రూతో విభేదం వచ్చింది. ఆయన కృషక్ మంజుదార్ ప్రజాపార్టీ పెట్టినప్పుడు ఆయనకు అండగా నిలిచారామె. కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించి, భర్తకు నైతిక మద్దతునిచ్చారు. కాంగ్రెస్‌లో చీలికలు వచ్చిన తర్వాత కూడా కాంగ్రెస్ సభ్యురాలైంది. భార్యాభర్తలిరువురికీ పార్టీ సభ్యత్వంలో తేడాలొచ్చినా, ఆమెకు తన పదవి పట్ల స్పష్టమైన అవగాహన ఉంది. భర్త గెలుపు కోసం ప్రచారం చేయలేదు. భర్త ఆరోగ్యం మంచి చెడ్డలను చూసుకొనే గృహిణిలా తన పాత్రను సక్రమంగా నిర్వహించారు. ఆమె చేస్తున్న పని పట్ల నిబద్ధత ఉన్న విషయాన్ని ఆమె వివాహమే నిరూపించింది. వివాహం పట్ల ఎంత నిబద్ధత ప్రదర్శించిందో, అట్లే లోకసభ సభ్యురాలిగా, చట్టసభలో, విధాన నిర్ణయాల్లో స్పష్టమైన బాధ్యతను నిర్వహించింది. ఈ నిబద్ధతే ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా కూడా ఆమె ప్రతిభా సమర్థతలు నిరూపితమైనాయి.

1962లో ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ పరస్పర విభేదాలతో రెండుగా చీలిపోయింది. కమలాపతి త్రిపాఠీ ఒక వర్గానికి నాయకత్వం వహించగా, సి.బి. గుప్తా మరో వర్గానికి నాయకత్వం వహించారు. సి.బి. గుప్తా నుంచి రాష్ట్రాన్ని నడిపించే ధీటైన నాయకత్వం చాలా అవసరం అంటూ ఆ బాధ్యతను స్వీకరించా ల్సిందిగా ఆమెను కోరారాయన.

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా సుచేత కృపలానీ దృఢమైన చిత్తంతో, రాష్ట్ర సమస్య లను పరిష్కరించారు. కార్య నిర్వహణలో సమర్థురాలిగా పేరు పొందిన సుచేత సునిశిత మైన రాజకీయ నాయకురాలిగా కూడా గుర్తింపు పొందారు. అరవై రెండు రోజుల పాటు కొన సాగిన సుదీర్ఘమైన నిరసన పోరాటాన్ని ధీటుగా ఎదుర్కొన్నారు. జీతాలు పెంచి తీరాలని కోరిన ఉద్యోగుల డిమాండుకు తలవంచక ఉద్యోగ సంఘాల నాయకులను పిలిపించి, వారిని సమాధాన పరిచి, ఆ సమస్య నుంచి గట్టెక్కారు.

నిరాడంబరత, నిజాయితీ, కష్టపడి నిబద్ధతతో పనిచేసే తత్త్వం ఉండి విజయ వంతంగా రాజకీయ జీవితాన్ని గడిపిన సుచేత రాజకీయాల్నించి వెలుపలికి వచ్చిన తర్వాత కూడా అంతే నిబద్ధతతో జీవితాన్ని కొనసాగించారు. తాను సంపాదించిన ధనాన్ని 'లోక్ కళ్యాణ్' సమితి ద్వారా నిరుపేదల ఆరోగ్యానికి వినియోగించారు.

జాతీయోద్యమంలో ఉద్యమ కారిణిగా నిప్పుకణికలా వెలుగొందిన సుచేతా కృపలానీ గృహిణిగా అంటే ఒద్దికగా ఒదిగిపోయారు. మొదట ఉత్తరప్రదేశ్‌లో లేబర్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ పరిశ్రమల శాఖలో మంత్రిగా పనిచేశారు. 1971లో పూర్తిగా రాజకీయాల నుంచి విశ్రాంతి తీసుకొని ధారావాహికంగా తన ఆత్మ కథను రాశారు. భారత స్వాతంత్ర్య సమరంలో ఆమె నిర్వహించిన పాత్ర విశిష్టమైంది. మూడు, నాలుగు వ్యాసాలు పంపిన తర్వాత ఆరోగ్యం బాగాలేక జీవిత చరిత్రను కొనసాగించలేదు. తన ఆరోగ్యం బాగాలేకపోయినప్పటికీ భర్తకు ఏ విధమైన ఇబ్బందీ కలిగించక ఎంతో ధైర్యంతో జీవితాన్ని కొనసాగించారు.

భారతదేశ చరిత్రలో ఆమె జీవితాన్ని సువర్ణాక్షరాలతో లిఖించవచ్చు. గొప్ప నాయకు రాలిగా, రాజకీయవేత్తగా, సమర్థురాలైన పాలకురాలిగా సుచేతాకృపలానీ ఎంతో ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడిపారు. భారత స్వాతంత్ర్య సమరంలో క్విట్ ఇండియా ఉద్యమం లో అరుణా సఫాలీ లాగా, ఉషా మెహతాలాగా అత్యంత ప్రధానమైన పాత్రను నిర్వహించారు. 1946లో దేశ విభజన విషయంలో గాంధీతో కలిసి కృషి చేశారు. రాజ్యాంగ నిర్మాణ సభలో ఉప సంఘ సభ్యురాలిగా భారత రాజ్యాంగాన్ని మలచటం లో తన వంతు కృషిని సల్పారు. స్వతంత్రం వచ్చినప్పుడు 'వందేమాతరం' పాటను ఆలపించారు. భారతదేశ మహిళా నాయకురాళ్లలో సుచేత ప్రత్యేకతను, ఆమె ధైర్యాన్ని పురుషులతో సమానంగా నిలబడి పోరాడగల శక్తిని నిరూపించుకొన్నారు. కాబోయే మహిళా నాయకురాళ్లందరికీ ఆమె స్ఫూర్తి ప్రదాయిని. 1974, డిసెంబర్ 1వ తేదీ రాత్రి ఆమె హార్ట్ ఎటాక్‌తో పరమపదించారు. అయినా, నాయకురాలిగా ఆమె నిర్వహించిన పాత్ర నిరంతరం మనకు స్ఫూర్తిదాయకం. అటువంటి నాయకురాళ్లే రాబోయే తరాలకు మార్గదర్శకులు.

# సమస్యకు తగిన పరిష్కారం

అవగాహనా సందర్భం

- శిలాలోలిత

స్త్రీలు శక్తివంతులైనప్పటికీ వాళ్ళకు రావల్సినంతగా గుర్తింపు రావడం లేదనేది వాస్తవం. ఫేస్‌బుక్‌లో మొన్నామధ్యన కర్లపాలెం హనుమంతరావు రాసిన ఓ వ్యాసం చదివాను. చాలా బాగుంది. షేర్ చేసుకుందామనిపించి రాస్తున్నా.. డాక్టర్ ఫయిజా అంజుమ్, డాక్టర్ సావిత్రీదేవి ఇద్దరూ వైద్యశాస్త్ర పట్టభద్రులు. సికింద్రాబాద్ లోని అపోలో ఆసుపత్రిలో పన్జేస్తున్నారు.

గత రాత్రి ఆసుపత్రి నుండి ఇంటికి వెళ్తుండగా రోడ్డు ప్రమాదంలో గాయపడిన ఓ వ్యక్తి అచేతనంగా రోడ్డుపై పడి ఉన్నాడు. అతని చుట్టూ జనం గుమికూడి సెల్‌ఫోన్లల్లో చిత్రీకరిస్తున్నారు. కానీ ఎవరూ సహాయం అందించడం లేదు. అతని పల్స్ నామమాత్రంగా, క్లిష్టంగా ఉంది. అక్కడున్నవారంతా అతను చనిపోయాడనే భావించారు. అంబులెన్స్‌కి ఫోన్ చేసినా అదింకా చేరుకోలేదు. ఇదంతా గమనించిన ఈ ఇద్దరు యువ డాక్టర్లు రోగిని పరిశీలించి గొంతు నుండి శ్వాస అందేలా చేశారు. వారి యొక్క నైపుణ్యాన్ని ఉపయోగించి ఎలాంటి పరికరాలు లేకున్నా, ఒక న్యూస్ పేపర్ ఉపయోగించి అతని ఊపిరితిత్తుల్లోకి గాలిని నింపి, శ్వాసను పునరుద్ధరింప జేసే పని చేశారు. ఛాతీని కూడా ఒత్తారు. రెండు నిముషాలకు అంబులెన్స్ వచ్చింది. ఆక్సిజన్, సెలైన్ ఎక్కించారు. ఆ తర్వాత అతని గుండె పూర్తిస్థాయిలో పనిచేసింది. ఇలా ఆ యువ డాక్టర్లు ఫయిజా అంజుమ్ సావిత్రీ దేవిలు స్ఫూర్తి నింపారు. వీరే నిజమైన డాక్టర్లు. వైద్యరంగంలో వీళ్లలాంటి వాళ్ల ఇంకా ఉన్నందుకు గర్వపడదాం. ఫయిజా అంజుమ్ హుజూరాబాద్‌కి చెందిన విద్యార్థిని. ఉపాధ్యాయుడు ఉస్మాన్ షాషా కుమార్తె.

**ఇలాంటి సంఘటనలు చదివినప్పుడు మానవత్వం మనిషి తత్వాన్ని ఇంకా వీడలేదని సంతోషం కలుగుతుంది. ఇటువంటి వార్తలను సేకరించి, ప్రచురించి ప్రచారం చేయడం ద్వారా మేలు కూడా జరుగుతుంది. వీళ్లిద్దరూ స్త్రీలైనందువల్ల రావాల్సినంతగా ప్రచారం రాలేదేమోననిపిస్తుంది. వైద్యరంగంలో ఇటీవల శిథిలమైపోతున్న విలువలు ఇలాంటి మానవతావాదుల రాకవల్ల కొంతమేరకన్నా పునరుద్ధరింపబడతాయనిపిస్తోంది.**

ఇలాంటి సంఘటనలు చదివినప్పుడు మానవత్వం మనిషి తత్వాన్ని ఇంకా వీడలేదని సంతోషం కలుగుతుంది. ఇటువంటి వార్తలను సేకరించి, ప్రచురించి ప్రచారం చేయడం ద్వారా మేలు కూడా జరుగుతుంది. వీళ్లిద్దరూ స్త్రీలైనందువల్ల రావాల్సినంతగా ప్రచారం రాలేదేమోననిపిస్తుంది. వైద్యరంగంలో ఇటీవల శిథిలమైపోతున్న విలువలు ఇలాంటి మానవతావాదుల రాకవల్ల కొంతమేరకన్నా పునరుద్ధరింపబడతాయనిపిస్తోంది.

ఈ మధ్యే 80 ఏళ్ళ వృద్ధురాలిపై అత్యాచారం జరిపి చంపేశారన్న వార్త చదివినప్పుడు మనసంతా చలించి పోయింది. ఏమిటి? ఎన్నాళ్లిలా? మనుషులెందుకు ఇంత రాక్షసత్వం వైపు ప్రయాణిస్తున్నారని ఆగ్రహం కట్టలు తెగుతోంది. నడిచే శక్తిలేని, జీవితమంతా ప్రయాణించి అలిసిపోయిన ఆ వృద్ధురాలిని ఎందుకలా చేశారని కోపం వస్తుంది. అసలు ఇటువంటి దుర్మార్గ ప్రవృత్తి ఉన్న వాళ్లకు బతికే హక్కెక్కడిది? చనిపోయిన వాళ్లు చనిపోతూనే ఉన్నారు. రహస్యాలుగా దాచుకున్న వాళ్లు దాచుకుంటూనే శిథిలమవుతున్నారు. స్త్రీలు మానసికంగా, శారీరకంగానూ బలోపేతులు కావాల్సిన అవసరం ఎంతో వుంది. ఈ సందర్భంగానే 'సంఘటన' అనే సినిమా వచ్చింది. నిత్యామీనన్ నటించిందందులో. ప్రేమించానని చెప్పి, నమ్మించి, బాస్‌తో అత్యాచారం చేయించి, ఆమెను వదిలించుకోవాలని, ఆమె బ్యాగులో మత్తు పదార్థాలుంచి జైలుపాలు చేస్తాడు. ముందు దు:ఖపడినా, జైలు వాతావరణం, సాటి స్త్రీల వల్ల ఆమె దృక్పథంలో మార్పు వస్తుంది. జైల్లో పరిచయం అయిన ఒక వ్యక్తి వల్ల తనను తాను బలోపేతం చేసుకోవాలనుకుంటుంది. తనలా ఏ స్త్రీ బలి కాకూడదనుకుంటుంది. విడుదల అయ్యాక, ఆ బాస్‌కు, తననెంతో క్రూరంగా హింసించి ప్రణాళిక ప్రకారం బంధించి, మిత్రుల సహాయంతో పాముకాట్లకు

గురయ్యేట్లుగా చేస్తుంది. ప్రేమను కలుషితం చేసిన వాడిని, వాడి లైంగిక స్వేచ్ఛకు బలైన ఎందరినో గుర్తు చేసుకొంటూ ఇంకే ఆడపిల్లా వాడి సంపాదనకు పరికరం కాకూడదని భావించి, వాడికి స్పృహ తప్పించి, వాడి పురుషాంగాన్ని ఆపరేషన్ చేసి తీసేస్తుంది. ఆమె నర్సు కాబట్టి అవలీలగా చేయగలిగింది. అయినా వాడిలో మార్పు రాలేదు. నేను మగాడ్ని అన్న అహంకారం పోలేదు. 'పురుషాంగాన్ని తీయగలిగావు కానీ, నా బుద్ధిని మార్చగలవా నువ్వు అన్న వాడి ప్రశ్న వాడిలో కరడుకట్టిన పురుషాహంకారానికి నిదర్శనం. ఇక్కడే మనకో నిజం తెలిసింది, హింసను చంపినా, తెగ్గొట్టినా చావదనీ, మానసికంగా మార్పు వచ్చినప్పుడే అది లేకుండా పోతుందని ఈ మార్పు ఎక్కడ్నుంచి వస్తుంది? కుటుంబాల నుంచే, ఇళ్లనుంచే, తల్లిదండ్రుల పెంపకం నుంచే.

భయం భయంగానే ఆడపిల్లల్ని పెంచుతూ, కట్టడి చేస్తూ, బలహీనులుగా పెంచడం కాక, ఆత్మస్థైర్యాన్ని కలిగివుండేలా పెంచాలి. మగపిల్లాడిని రాజ్యాధికారిగా, రాకుమారుడిలా, మాంత్రికుడిలా, దుర్మార్గుడిలా కాకా మానవత్వమున్న మనిషిలా పెంచగలగాలి. ఆంబోతుల్లా రోడ్ల మీదకు ఒదలకూడదు. తప్పు ఎవరు చేసినా తప్పే అనే స్పృహ ఉండాలి. స్త్రీ పురుషులిద్దరూ సమానులేనని, స్త్రీ బలహీనమైనదీ, ఎప్పుడంటే అప్పుడు, ఎలా అంటే అలా అనుభవించే వస్తువు కాదని, తోటి ప్రాణి అనే భావాలతో పెంచగలిగితే ఇన్ని సమస్యలు ఉత్పన్నం కావు. మొన్నటికి మొన్న బెంగుళూరులో నడిరోడ్డుపై ఆమెను హింసించిన తీరు ఎంత జుగుప్సాకరంగా ఉంది. అంజుమ్, సావిత్రి లాంటి మానవత్వం ఉన్న మనుషులు, మాలిని లాంటి ధైర్యవంతులైన స్త్రీలు ఉండాల్సిన సమాజం కోసం శ్రమిద్దాం.



ప్రసంగిస్తున్న ఐద్వా ఉపాధ్యక్షురాలు సుభాషిణి అలీ




సందేశమిస్తున్న ట్రేడ్ యూనియన్ నాయకులు కె. హేమలత



చర్చలో పాల్గొన్న ఏపి ప్రతినిధులు ఆర్.మాధవి, సాయిలక్ష్మి, వి.లక్ష్మి



ఏపి ప్రతినిధుల ఆట, పాట

వ్యాసం

# ముట్టు ముట్టరానిదా!

- వేములపల్లి సత్యవతి

విశ్వంలో అనేక గ్రహాలున్నాయి. వాటిలో భూమి కూడా ఒక గ్రహమే. భూమండలం మీద కోట్ల సంఖ్యల్లో రకరకాల జీవరాశులు జీవిస్తున్నాయి. ప్రతి జీవరాశిలోనూ ఆడ-మగ అనే ప్రాణు లున్నాయి. మనిషి కూడా ఒక ప్రాణి. మిగతా ప్రాణికోటి నుంచి మనిషిని మాటవేరు చేసింది. ప్రకృతిలోని ప్రాణికోటిలో ఆడా మగా శరీరాకృతిలో కొంత తేడా ఉంది. జంతువుల్లోను, పశు పక్ష్యాదుల్లోనూ, మనుషుల్లోనూ, ఈ తేడాలను ప్రత్యక్షంగా చూడొచ్చు. ఆడ-మగ జతకట్టడం వల్లనే పునరుత్పత్తి జరుగుతుంది. కోడిపెట్ట గుడ్లను పెట్టి పొదిగి పిల్లలను చేస్తుంది. పిల్లలుగా ఉన్నప్పుడు వాటిలో ఆడవేవో మగవేవో కనిపెట్టలేం. పెరిగి పెద్దయి యుక్తవయసు రాగానే పుంజులుగా, పెట్టలుగా గుర్తిస్తాం. మగపుంజుకు నెత్తిమీద జుట్టు ఉంటుంది. తెల్లవారు ఝామున పుంజు కొక్కొరకో అని కూస్తుంది. పెట్ట కొక్కొరొకో అని కూయ లేదు. ఎద్దుకు వీపుమీద మూపురం ఉంటుంది. ఆవుకు ఉండదు. సంతానానికి ఆహారం కొరకు ఆవుకు పొదుగు, స్తనాలు ఉంటాయి. మగ సింహానికి మెడపై జూలు ఉంటుంది. గర్జిస్తుంది. ఆడ సింహానికి జూలు ఉండదు. మగ నెమలి పురి విప్పి నాట్యం చేస్తుంది. ఆడ నెమలి నృత్యం చేయదు. మనిషిలో కూడ ఆడ-మగ శరీరాకృతిలో తేడా ఉంటుంది. కళ్లు, చెవులు, చేతులు, నోరు, ముక్కు, కాళ్లు స్త్రీ-పురుషులందరకు సమానంగానే ఉంటాయి. ఈ అవయవాలలో ఏ అవయవమైన లోపించిన వారిని వికలాంగులంటాం. వయసుతో పాటు శరీరం పెరుగుతుంది. యుక్తవయస్సు రాగానే మగపిల్లలకు మీసాలు, గడ్డం మొలకెత్తటం మొదలవుతుంది. ఆడపిల్లలకు స్తనాలు ఏర్పడటం మొదలవుతుంది. పన్నెండు, పదమూడు, పదు నాలుగేళ్ల వయసులో ఆడపిల్లలు రజస్వలవుతారు. పుట్టిన సంతా నానికి ఆహారం కొరకు మహిళలకు ప్రకృతి స్తనాలను ఏర్పరిచింది. రజస్వల అయినపుడు కొన్ని ప్రాంతాల్లో తొమ్మిది రోజులు, పదకొండురోజులు బయటకు రాకుండా, ఇల్లంతా తిరగకుండా ఒకగదిలో, ఒక మూలనో కూర్చోబెడతారు. తొమ్మిదో రోజున, పదకొండో రోజున కుండల్లో కలిపే సమయాన బంధువులకు భోజనాలు పెట్టి ఉత్సవాలు జరుపుతారు. రజస్వలయినపుడు కుండల్లో కలిపేదాకా (ఇంట్లో తిరగకూడదు) ఉప్పు, కారం కూరలు పెట్టరు. మట్టి మూకుడులో అన్నం పెడతారు. పులగం, పాయసం, పూర్ణాలు తీపి పదార్థాలే పెడతారు. సాయంకాలం అమ్మాయిని అలంకరించి బంధువులు కట్నకానుకలు సమర్పిస్తారు. అదే మగ పిల్లలకు మీసాలు, గడ్డాలు మొలకెత్తినపుడు ఏ ప్రత్యేకతలు ఉండవు.




రజస్వల అనంతరం కొంతమందికి ఆరునెలలకో లేక నెల నెలకో ముట్టు వస్తుంది. దానినే నెలసరి అని, రుతు క్రమమని అంటున్నాం. గ్రామీణ మహి ళలకు, పట్టణాల్లోని నిరక్షరాస్యులైన మహిళలకు నెలసరి అన్నా, ఋతు క్రమమన్నా తెలవదు. మహిళలకు నెల నెల వచ్చే ముట్టును ముట్టుకోకూడదని మూడురోజులు మూలన కూర్చోబెడతారు. ఆమె ఎవరినీ తాకకూడదు. ఇంట్లో తిరగకూడదు. చిన్న పిల్లలు తెలియక తాకితే వెంటనే వాళ్ల బట్టలను మారుస్తారు.

ఆడపిల్లలు యుక్త వయసు రాగానే రజస్వల కావటానికి పునరుత్పత్తికి మార్గమేర్పడటం, అందుకు ప్రకృతి ఆడపిల్లల జననాంగంలో ఉల్లిపొరకన్నా అతి పలుచని పొరను ఏర్పాటు చేసింది. ఆ పొరను కన్నెపొర అంటారు. కన్నెపొరను గురించి, రజస్వలను గురించి డా. కొమర్రాజు అచ్చమాంబగారు 'ప్రసూతి-శిశు పోషణ' అనే గ్రంథంలో సవివరంగా రాశారు. ముట్టుకోకూడదనే ఆచారాన్ని ఈ రోజుల్లో దాదాపు ఎవరూ పాటించడం లేదు.

రజస్వల అయినపుడు తప్ప ఇప్పటి యువతులు చదువులకు, ఉద్యోగాలకు వెళుతున్నారు. ఆ రోజుల్లో ఎవరు సుఖపెట్టినా, పెట్టకపోయినా ముట్టు మూడురోజులు మహిళలను సుఖపెడుతుందని కూడా అనేవారు. అయితే అది అన్ని సామాజిక వర్గాల మహిళలకు వర్తించదు. రెక్కాడినా డొక్కాడని బడుగుజీవులు మూడురోజులు మూలన కూర్చుంటే అయిదువేళ్ల నోటిలోనికి వెళ్లేదెలా? ముట్టు లేకపోతే మానవజన్మే ఉండదు. రజస్వల కాని ఆడపిల్లలను (వేలలో ఒకరుంటారేమో) మాసికమ్మని అనేవారు. వివాహానికి అర్హురాలు కాదు. అలాగే పురుషుల్లో నపుంసకులు కూడా ఉంటారు.

ముంబయిలోని "హజీ మలాంగ్" దర్గాలో మహిళల ప్రవేశానికి 2012 వరకు ఎలాంటి నిషేధం లేదు. తర్వాత దర్గా ట్రస్టు వారు నిషేధించారు. దానిని సవాలు చేస్తూ భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్ సంస్థకు చెందిన ఇద్దరు సభ్యురాలు ప్రజాహిత వ్యాజ్యం పేరుతో సుప్రీంలో పిల్ దాఖలు చేశారు. ఇరుపక్షాల వాదనలు విన్న ధర్మాసనం 2012 వరకు లేని నిషేధాన్ని ఇప్పుడు విధించడం అనుచితమని ముస్లిం మహిళలు మత గురువుల సమాధి వరకు వెళ్ళవచ్చని తీర్పు చెప్పింది. మత గురువులు కూడా మహిళల కడుపుల్లో నుంచే పుట్టారని, వారికి జన్మనిచ్చిన మహిళలు అపవిత్రులు ఎలా అవుతారని మహిళా ఆందోళన్‌కు చెందిన సభ్యులు ప్రశ్నించారు. అక్కడ పాత సంప్రదాయాన్ని తిరిగి భారీగా అమలు చేస్తున్నారు. శబరిమలై దేవా లయ అధికారి మహిళలు గుడి ప్రవేశంపై గుడిలోకి రావటానికి అనువైన సమయమా కాదా తెలుసు కునే స్కానింగ్ మిషన్ల గురించి మాట్లాడటం కూడా అంటూ, ముట్టు పేరుతో స్త్రీలను దూరంగా ఉంచడమే. ఈ సమస్యపై "హ్యాపీటు బ్లీడ్" పేరుతో అమ్మాయిలు రుతుక్రమం అపవిత్రం, అంటరానిదైతే పురుషుడి జన్మకూడా అపవిత్రమేనంటూ ఉద్యమిస్తున్నారు. న్యాయస్థానంలో ఈ సమస్యపై చర్చ జరుగుతోంది.

మత గురువులు కూడా మహిళల కడుపుల్లో నుంచే పుట్టారని, వారికి జన్మనిచ్చిన మహిళలు అపవిత్రులు ఎలా అవుతారని మహిళా ఆందోళన్‌కు చెందిన సభ్యులు ప్రశ్నించారు.అక్కడ పాత సంప్రదాయాన్ని తిరిగి భారీగా అమలు చేస్తున్నారు. శబరిమలై దేవాలయ అధికారి మహిళలు గుడి ప్రవేశంపై గుడిలోకి రావటానికి అనువైన సమయమా కాదా తెలుసుకునే స్కానింగ్ మిషన్ల గురించి మాట్లాడటం కూడా అంటూ, ముట్టు పేరుతో స్త్రీలను దూరంగా ఉంచడమే. ఈ సమస్యపై "హ్యాపీటు బ్లీడ్" పేరుతో అమ్మాయిలు రుతుక్రమం అపవిత్రం, అంటరానిదైతే పురుషుడి జన్మకూడా అపవిత్రమేనంటూ ఉద్యమిస్తున్నారు.

ఆచారాలు, సంప్రదాయాలు సమాజంలో మారుతూ ఉంటాయి. సంస్కరణల నేపథ్యంలో రజస్వల అయిన అమ్మాయిని వేరుగా కూర్చోబెట్టటం, వేడుకలు జరపడం మానివేశారు. దానికి కారణం చదువు. పక్క ఇంటివారికి కూడా తెలపకుండా రెండు, మూడు రోజుల తర్వాత పాఠశాలలకు, కళాశాలలకు పంపుతున్నారు. నెలసరి రోజుల్లో ఆ మూడు రోజులూ కళాశాలలకు, ఉద్యోగాలకు వెళుతున్నారు. ఈ మార్పు మనదేశంలో అన్ని ప్రాంతాలల్లోను జరగటం లేదు. ఉత్తర భారతంలో ఒక ప్రాంతంలో నేటికీ చాలా ఘోరమైన దురాచారం అమలవుతోంది. ముట్టు మహిళల కోసం ఊరికి చాలా దూరంగా కొన్ని గుడిసెలు వేసి ఉంచుతారు. ఆ మూడు రోజులు మహిళలు ఆ గుడిసెల్లో ఉండాలి. కరెంటు ఉండదు. రాత్రి దీపం వెలుతురు కూడా లేకుండా ఉంటారు. పాములు, తేళ్ళు రాత్రి సమయంలో గుడిసెల్లోకి వెళ్లటం, కాటువేయటం జరుగుతూ ఉంటుంది. కొంతమంది చనిపోతూఉంటారు. అప్పుడప్పుడు అడవుల్లో నుండి క్రూర మృగాలు కూడా వస్తుంటాయి.. అవి రాకుండా గుడిసెల చుట్టూ ఎలాంటి రక్షణ ఏర్పాట్లు ఉండవు. జ్వరాలొచ్చినా మందూ మాకూ లేకుండా పడి ఉండాలి. వైద్య సౌకర్యాలు కలుగజేయరు. పాము కాటు వేసినా, జ్వరపీడితులైనా ఆరు నూరైనా ఆ మహిళలు ఊరిలోని తమ ఇంటికి వెళ్లడానికి వీలులేదు. ఈ దురాచారానికి వ్యతిరేకంగా ఒక స్వచ్ఛంద సంస్థ ఆందోళన చేపట్టి రాష్ట్రప్రభుత్వం చేత చట్టం చేయించి ఆ దురాచారాన్ని నిషేధింపచేసింది. ఎన్నో చట్టాల్లాగే ఆ చట్టమూ చతికిలబడింది. చట్టం చేసి చేతులు దులుపుకుంటే సరిపోతుందా! దాన్ని అమలు చేయటానికి తగిన సిబ్బందిని ఏర్పాటు చేసి కఠినంగా అమలయ్యేలాగ కృషిచేయాలి. లేకపోతే గ్రామాల పురుష పంచాయతీ పెద్దల ముందు చట్టాలు వారి చుట్టాలవుతున్నాయి.



# మహిళలను కించపరిచే వారిపై "యుద్ధం"

సినిమా సమీక్ష

- డా॥ శమంతకమణి

"ఆకాశంలో సగం, అవనిలో సగం,"

"అమ్మవు నీవే, అక్కవు నీవే,

"అలివి నీవే, ఆత్మీయురాలివీ నీవే"

కానీ నీ శక్తిని, సమర్థతను అంగీకరించం. నీ వాటా సక్రమంగా అందనివ్వం... ఎందుకంటే నువ్వు ఆడపిల్లవు. ఆధిపత్య ధోరణిని ప్రశ్నిస్తే ధిక్కార స్వరం అన్న కిరీటాలు... తన వాటాకై పోరాటం చేసే క్రమంలో ఎన్నో అవాంతరాలు, అడ్డంకులు, అయినా అన్నింటినీ ఎదిరిస్తూ ముందుకు సాగడానికి చేయాల్సింది యుద్ధమే

అది ఏ రంగమైనా సరే!

నాన్నా ఈసారి మన స్ట్రాటజీ ఏంటి?

'ప్రత్యేకంగా ఏమీలేదు బిడ్డా'

తండ్రి సందేశం...

ఎస్... ఈ పాయింట్ ఆధారంగా ఓ వాస్తవ గాథను సినిమా కనుగుణమైన మార్పులు చేసుకుని వాల్ట్ డిస్నీ పిక్చర్స్, అమీర్ ఖాన్ ప్రొడక్షన్స్, యూటీవీ మోషన్ పిక్చర్స్ వారందించిన చిత్రమే "దంగల్" అంటే "యుద్ధం".



ఈ సినిమా కథ మహవీర్ సింగ్ ఫోగట్ జీవితం ఆధారంగా సెల్యులాయిడ్‌పై నితేశ్ తివారీ దర్శకత్వంలో, ప్రీతమ్ సంగీతంలో ఆద్యంతం రసవత్తరంగా, సందేశాత్మకంగా 2 గంటల 40 నిమిషాలు ప్రేక్షకులను తనతో నడిపిస్తుంది.

కథాంశంలోకి వెళితే "హర్యానాలోని జాట్ కులం అగ్రవర్ణ ఆధిపత్యానికి చిరునామా. 'భలాలి' గ్రామానికి చెందిన మహవీర్‌సింగ్ ఫోగాట్, జాతీయ స్థాయిలో పతకాలు సాధించిన మల్లయోధుడు. అంతర్జాతీయ స్థాయిలో రాణించి, భారత దేశానికి పతకం సాధించాలన్న సంకల్పమున్నప్పటికీ జీవిత భద్రత లేని, క్రీడారంగంలో తండ్రిమాటకు తలొగ్గి చిరుద్యోగిగా మారతాడు. వివాహమైన తర్వాత తనకు కలిగే "మగబిడ్డ" ద్వారా తన కలను సాకారం చేసుకోవాలనుకుంటాడు. కానీ వరుసగా నలుగురు కూతుళ్ళు గీత, బబిత, ప్రియాంక, రీతు జన్మిస్తారు. తన ఆశకు నీళ్లొదిలేసిన తరుణంలో" తమను ఏడిపించిన మగపిల్లలను చిత్తుగా తన్నేస్తారు గీత, బబిత. ఆ దెబ్బలు చూసి ఆశ్చర్యపోయిన మహవీర్, వారు ఎలా కొట్టారో చూపమంటాడు. కూతుళ్లు కొట్టిన విధానంతో ఆనందపడిన ఆ తండ్రి దేశానికి బంగారు పతకం తేవడం మగపిల్లల వల్లనే అనుకోవడం తన భ్రమ అని, ఎవరు తెచ్చినా బంగారం బంగారమే గదా అని తన కూతుళ్లను మల్లయోధులుగా చేయాలని నిర్ణయించుకుంటాడు.

భర్త ఆలోచనను తొలుత భార్య

వ్యతిరేకించినా, అతని కలను సాకా రం చేయడానికి ఒక్క సంవత్సరం సహకరించేందుకు అంగీకరిస్తుంది. ఆహార వ్యవహార నియమాలు, శారీరక శ్రమ పట్ల పిల్లల అయిష్టత, గ్రామస్థుల వెక్కిరింతలు, వేధింపుల మధ్య మగపిల్లలతో కలసి సాధన చేసే అవకాశాలు లేకపోవడం, స్వంత భూమిలోనే సాధన, మాంసా హార భక్షణం, పోటీలకు అనుమ తించని నిర్వాహకుల వ్యవహార శైలి, వ్యాపార దృష్టిలో అనుమతించడం, క్రమానుగతంగా, జిల్లాలో, రాష్ట్ర స్థాయిలో, జాతీయ స్థాయిలో పతక సాధన, కోచింగ్‌లో శాస్త్రీయత, మౌలిక వసతుల లేమి నుండే, అంతర్జాతీయ స్థాయి పోటీల్లో ఎదుర్కొనే క్లిష్టమైన మానసిక సంఘ ర్షణలు, పాటించాల్సిన ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, సంక్లిష్ట సమయాలను ఎదుర్కొనే మానసిక ధైర్యం ఇలా వివిధ అంశాలు సమపాళ్లలో సమకూరాయి, అందుకే కల కంటే వాస్తవం ఎంతో క్లిష్టమైంది. ఉద్వేగమైనది.

నితీశ్‌తివారీ, పీయూష్ గుప్త, శ్రేయా జైన్, నిఖిల్ మల్హోత్ర....

హృద్యమైన ఫొటోగ్రఫీ ని సత్యాజీపాండే అందించగా, మల్లయుద్ధాలను పటిష్ఠంగా తీర్చిదిద్దాడు భల్లూ సలూజా.

ఇది స్త్రీలను కించపరిచే వారిపై చేసిన యుద్ధం. బాల్య వివాహాలకు బలవుతున్న వేలాది మంది బాలికలకు భిన్నంగా తన కూతుళ్లను తీర్చిదిద్దడానికి సమాజంపై తండ్రి చేసిన యుద్ధం... భర్తకు ఎదురాడ లేక, సమాజానికి సమాధానం చెప్పలేక, కఠిన శిక్షణనిస్తున్న తండ్రితో మూగ యుద్ధం చేస్తున్న కూతుళ్లను సమర్థించలేక, అనునయించలేక భర్తకు, బిడ్డలకు మధ్య మానసిక సంఘర్షణతో ఓ తల్లి చేసిన యుద్ధం. మగవాళ్ల సామ్రాజ్యంగా భావించే మల్ల యుద్ధపు పోటీల్లో తమ ప్రవేశం, పోరాటం, గెలుపు కోసం క్రీడా కారిణులు చేసిన యుద్ధం.

గ్రామీణ వాతావరణానికి, అధునాతన శిక్షణా కార్యక్రమానికి మారిన తరుణంలో తన అస్తిత్వాన్ని, ఉనికిని కాపాడుకొనే యత్నంలో జారిపోతున్న తరుణంలో పైకి లేవడానికి ఓ టీనేజర్ చేసే యుద్ధం. పతక సాధనలో ఎదురయ్యే అనేకానేక అడ్డంకులను తొలగించుకునే క్రమంలో తన మానసిక స్థితిని పదును పెట్టుకుంటకూ రాటుదేలే ఓ యువతి చేసే యుద్ధం.

ఇలాంటి సెల్యులాయిడ్ ఆవిష్కరణకు మూలమైన గీతా ఫోగాట్, బబితా ఫోగాట్‌ల విజయాలకు మూలంగా తండ్రి మహావీర్‌సింగ్ కారణమయినప్పటికీ ఆయనకు స్ఫూర్తి, తన ఆడబిడ్డలను స్త్రీ ప్రవేశంలేని మల్ల యుద్ధ రంగంలోకి దించడానికి అసలైన ప్రేరణ. తెలుగు తేజం కరణం మల్లేశ్వరి 2000ఒలింపిక్స్‌లో సాధించిన కాంస్య పతాకమే స్ఫూర్తి... ఆమెను, సాధించిన విజయాన్నీ ఆకళింపు చేసుకున్న మహావీర్ తన కూతుళ్లను తాననుకున్న స్థాయికి చేర్చడంలో జీవితంలో ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొని, అనుకున్నది సాధించి, చరిత్రలో తన కూతుళ్లకు స్థానం సుస్థిరం చేశాడు.

దంగల్ సినిమా చూడడం అంటే స్త్రీ జాతి తనను తాను యుద్ధానికి సిద్ధం చేసుకోవడం, పోరాటంలో విజయాలు సాధించడానికి చేయాల్సిన కృషిని, ఎదుర్కోవాల్సిన అవమానాలను, ఆనందించాల్సిన విజయాలను, చరిత్రలో తమకో పేజీ లిఖించుకోవడానికి తమతో తాము చేయాల్సిన యుద్ధం...చూడండి, మీ చుట్టూ ఉన్న సమాజాన్ని కూడా "యుద్ధానికి" ఆహ్వానించాల్సిన సమయమని గుర్తెరగడం.

# సంసా'రథచక్రాలు'

కేస్ స్టడీ

- కె. శారద

"అమ్మా! మా అమ్మాయిని, అల్లుడిని కలిసి ఉంటే ఉండమనండి లేదంటే విడాకులు ఇప్పించండి. ఈ బాధ భరించలేకుండా వున్నాము". ఐద్వా లీగల్ సెల్‌కి వచ్చి ఒక నడి వయసు మహిళ ఇలా అడుగుతోంది. 'ఏమిటమ్మా గొడవ ఏమిటి' అని అడిగితే ఇలా చెప్పింది.

'మా అమ్మాయి పేరు సుమ, అల్లుడు సురేష్. మాకు ఒక మనుమరాలు. మా అమ్మాయి అల్లుడు ఇద్దరూ టీచర్లే. ఈ మధ్యే మా అబ్బాయికి కూడా ఉద్యోగం వచ్చింది. మా బాధంతా మా అమ్మాయి కాపురం గురించే అంది. 'అమ్మాయిని పిలవండి అమ్మాయితో మాట్లాడుతాం' అన్నారు ఐద్వా బాధ్యులు. తరువాత ఆమె తల్లిదండ్రులతో కలిసి వచ్చింది. ఆమె ఇలా చెప్పింది. 'మేమిద్దరం పెళ్ళికి ముందే బి.ఇడి చేశాము. ఇద్దరికీ పోస్టింగ్స్ ఒకేసారి వచ్చాయి. తను ఒక వారం ముందు చేరారు. మా ఇద్దరి స్కూల్స్ మేము ఉన్న ఇంటికి 10కి.మీ దూరంలో వేరు వేరు గ్రామాలలో వుంటాయి'. అంది సుమ. 'సమస్య ఏమిటమ్మా'? అని అడిగారు ఐద్వా బాధ్యులు. ఏముంది మేడం 'ఎక్కడా నన్ను ఏడాది కూడా వుంచడం లేదు' నేను తనున్న గ్రామానికి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్న వెంటనే తను మరొక ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటున్నాడు. ఇలా నాలుగయిదు సార్లు జరిగింది. నేను గర్భవతిగా వుండగా కూడా ఇలాగే చేశాడు. పాపతో ఒంటరిగా వుండలేకపోతున్నాను ఒక్కదాన్నే ఉంటుంటే అందరూ అనేక రకాలుగా హింసిస్తున్నారు. అయినా ధైర్యంగానే బతుకుతున్నాను. ఇలా ఎన్నాళ్ళు? పాపతో వంటరిగా వుండలేక అమ్మ వాళ్ళ దగ్గరకు వచ్చేశాను. ఒక్క శెలవు రోజు కూడా ఇంట్లో వుండడు. స్కూలు నుంచి అటే వాళ్ళ అమ్మమ్మగారి ఊరు వెళ్ళిపోతాడు. మళ్ళీ సోమవారం తిన్నగా స్కూలుకు వచ్చేస్తాడు. డబ్బు కూడా ఏమీ దాచలేదు. ఖర్చులన్నీ నేనే చూసుకుంటా. తన జీతం ఏమవుతుందో నాకు తెలియదు. పాప ఎదుగుతుంటే ఖర్చులు పెరుగుతున్నాయి. మంచి చదువు చెప్పించాలి కదా. మేమిద్దరం బాగానే చదువుకున్నాం. ఈ పరిస్థితిలో నాకు రెండవ సంతానం కూడా వద్దనుకున్నాను. నా జీతంలో ఎల్.ఐ.సిలు అవి కడతాను. నా డబ్బంతా నాన్న నా పేరున, పాప పేరున ఎకౌంట్‌లో వేస్తారు. అతను నన్ను ఎందుకు దూరంగా ఉంచుతాడో నాకు అర్థం కావడంలేదు. మీరు నా భర్తను పిలిచి మాట్లాడండి మేడం' అంది సుమ.

అబ్బాయికి లెటరు పంపించారు ఐద్వా లీగల్ సెల్ నుండి. తరువాత వారం అబ్బాయి సురేష్ వచ్చాడు. మీ సమస్య ఏంటో చెప్పమని అడిగారు ఐద్వా పెద్దలు. నాకే సమస్యలూ లేవు. నాకు ఏ వ్యసనాలు కూడా లేవు. మాది పెద్దలు చేసిన పెళ్లే 'ఆమే నన్ను అర్థం చేసుకోదు. గట్టిగా మాట్లాడుతుంది. ఏదైనా డామినేటింగ్‌గా చెబుతుంది. నిదానంగా మాట్లాడటమే రాదు. పాపని కూడా నాదగ్గరకు రానివ్వదు. నన్ను చిన్నప్పటి నుంచి అమ్మమ్మా, మామయ్యలు చాలా ప్రేమగా చూసుకున్నారు. అందుకని మామయ్యకు అవసరమైనపుడు కొంత ధన సహాయం చేశాను. వారం వారం అమ్మమ్మను చూడటానికి వెళతాను. తను వాళ్ళతో సరిగా మాట్లాడదు. అందుకే తనను రమ్మని అడగను. వంట కూడా సరిగా చెయ్యదు. ఒక రోజు వండి మూడు రోజులు తినమంటుంది. అదేమంటే పొదుపు

> ఇద్దరి మధ్య అరమరికలు రహస్యాలు లేకుండా వుండాలి అభిప్రాయ బేధాలు వున్నా సర్దుకు పోవడం నేర్చుకోవాలి. మీరెంత ఆనందంగా అన్యోన్యంగా వుంటే పాప అంత ఆరోగ్యంగా పెరుగుతుంది. రేపటి తరం వారిదే కదా. మరి మరోక తరాన్ని తయారు చేసే తల్లిదండ్రులు ఎంత విజ్ఞతతో అవగాహనతో జీవించాలి. అందునా ఇద్దరూ బాధ్యతాయుతమైన ఉపాధ్యాయ వృత్తిలో వున్నారు.

అంటుంది. భోజనమే సరిగా లేకపోతే ఇంక ఈ సంపాదనలు, ఉద్యోగాలు ఎందుకు?' అని అడిగాడు సురేష్. ఆమె చెయ్యకపోతే ఎందుకోయ్ నీకు కావలసినవి నువ్వే చేసుకోవచ్చుగా' అన్నారు ఐద్వా పెద్దలు. నేను వేస్ట్ చేస్తానని నన్ను వంటింట్లోకి రానివ్వదు మేడం. అసలు నీ జీతం అంతా ఏమి చేస్తున్నావ్ అని అడిగారు ఐద్వా బాధ్యులు. నేను మామయ్యకి ఇచ్చిన డబ్బు బ్యాంక్‌లో లోన్ తీసుకున్నాను. అది క్లియర్ చేస్తూ వుంటాను. ఎల్.ఐ.సిలు కడతాను. మా మామయ్య ఊరికి దగ్గరలో చిన్న స్థలం తీసుకున్నాను. దానికి లక్ష అడ్వాన్స్ ఇచ్చాను' అని చెప్పాడు. అది కాక ఇంకా నా దగ్గర ఐదు వేలు మిగులుతాయి అని చెప్పాడు. ఐద్వా బాధ్యులు ఇద్దరినీ కూర్చోబెట్టి మాట్లాడారు. కౌన్సెలింగ్ కూడా చేయించారు అమ్మాయికి. సురేష్‌కూ భార్యను ఎలా చూసుకోవాలి. భార్య ఇష్టాలను ఎలా గౌరవించాలి అని డబ్బు ఖర్చు విషయంలో ఇద్దరూ మాట్లాడుకుని చేయాలని అవసరమైతే ఇంటి పనులకు భార్యకు సహాయం చేస్తే తప్పేమీ లేదని ఐద్వా బాధ్యులు వివరించి చెప్పారు. భర్తను ఎలా అర్థం చేసుకోవాలి, ఎలా మాట్లాడాలి ఇవన్నీ చెప్పారు. చిన్నప్పుడు పెంచి పెద్ద చేసిన మామయ్యకు డబ్బు సహాయం చేయడం తప్పు కాదు కదా అని అడిగారు? వయసైన అమ్మమ్మను చూడడం కూడా తప్పు కాదుకదా? స్థలం పాప పేరుతో రిజిస్టర్ చేయమన్నారు. ఇద్దరికీ దగ్గరలో ఇల్లు తీసుకోమన్నారు. అతని జీతంలో ఐదు వేలు ఇంటి అద్దెకు వాడతానని చెప్పాడు. మిగతా ఖర్చులు ఆమె జీతంలోనే సర్దుకో మన్నారు. ఆమె తల్లి తండ్రులు స్థలం వెనక్కి ఇచ్చేయమనండి మేము ఒక ఐదు లక్షలు సర్దుతాము మా అమ్మాయి పేర ఇల్లు కొనమనండి. మా అల్లుడ్ని మా అమ్మాయి పోషించడం ఏమిటి?' అని వాదించారు.

బాధ్యులు ఇలా చెప్పారు:- స్థలం వెనక్కి తీసుకుంటే లక్ష నష్టపోతారు, స్థలం ఖరీదు పెరుగుతుంది. నాలుగైదేళ్ళు ఆగి ఆ స్థలం అమ్మి మీరిచ్చే డబ్బుతో కలిపి ఇల్లు కొనుక్కుంటారు. ఇప్పటికి ఇలా జరగని వ్వండి. ఎవరు ఎవరిని పోషించారన్నది కాదు. వారిద్దరూ కలిసి ఉండటం కావాలిప్పుడు అతని అమ్మమ్మని మీ అమ్మాయి జాగ్రత్తగా చూసుకుంటే మిమ్మల్ని అల్లుడు బాగా చూసుకుంటాడు. సురేష్‌తో కలిపి సుమను కూడా వాళ్ళ అమ్మమ్మ దగ్గరకు వెళ్ళమని చెప్పాం. భార్యా భర్తలు ఇద్దరూ విడి విడిగా ఎందుకు వెళ్ళాలి? ఇద్దరి మధ్య అరమరికలు రహ స్యాలు లేకుండా వుండాలి అభిప్రాయ బేధాలు వున్నా సర్దుకు పోవడం నేర్చుకోవాలి.

మీరెంత ఆనందంగా అన్యోన్యంగా వుంటే పాప అంత ఆరోగ్యంగా పెరుగుతుంది. రేపటి తరం వారిదే కదా. మరి మరోక తరాన్ని తయారు చేసే తల్లిదండ్రులు ఎంత విజ్ఞతతో అవగాహనతో జీవించాలి. అందునా ఇద్దరూ బాధ్యతాయుతమైన ఉపాధ్యాయ వృత్తిలో వున్నారు. ఇంత చిన్న విషయాలకే ఆమె తల్లి విడాకులు కోరింది. కుమార్తెకు భార్యా భర్తల సంబంధంపై ఏ మాత్రం అవగాహన లేకుండా చేసి వారు విడిపోవడానికి ప్రయత్నించడం ఏమిటి? ఇలాంటి పెద్దలందరి మధ్య ఆ పాప పెరిగి మంచి యువతిగా మారాలంటే ఎంత బాధ్యతగా వుండాలి? అవన్నీ ఆ తల్లి దండ్రులకు చెప్పి వారికి ఒక అవగాహన కల్పించి డబ్బే సర్వస్వం కాదు జీవితం ముఖ్యం అని చెప్పినారు. తల్లిదండ్రులని వారి సంసారం విషయంలో కలుగజేసు కోవద్దని లీగల్‌సెల్ బాధ్యులు చెప్పారు.

"భార్యా భర్తా అంటే సంసార రథానికి రెండు చక్రాల వంటి వారు. ఆ రథం చక్కగా నడవాలంటే రెండు చక్రాలూ కలిసి నడవాలి. రెండు చెరొకవైపు లాగితే ఆ రథం నడవదు. లేదా అపసవ్యంగా నడుస్తుంది. ఇదే జీవన సూత్రం దీన్ని ఆచరిస్తే చాలా కాపురాలు ఆనందంగా సాగిపోతాయి" అని చెప్పి పంపారు ఆ జంటను.

**భార్యా భర్తలు ఇద్దరూ విడివిడిగా ఎందుకు వెళ్ళాలి? ఇద్దరి మధ్య అరమరికలు రహస్యాలు లేకుండా వుండాలి అభిప్రాయ బేధాలు వున్నా సర్దుకుపోవడం నేర్చుకోవాలి. "భార్యా భర్తా అంటే సంసార రథానికి రెండు చక్రాల వంటి వారు. ఆ రథం చక్కగా నడవాలంటే రెండు చక్రాలూ కలిసి నడవాలి. రెండు చెరొకవైపు లాగితే ఆ రథం నడవదు. లేదా అపసవ్యంగా నడుస్తుంది. ఇదే జీవన సూత్రం దీన్ని ఆచరిస్తే చాలా కాపురాలు ఆనందంగా సాగిపోతాయి"**

# ఉద్యమాల బాటలో...

**ఆరోగ్యం:-** ప్రజా ఆరోగ్య సర్వే బాడంగి,సాలూరు, బొబ్బిలి సి. హెచ్.సి., పశ్చిమ గోదావరి జిల్లా దెందులూరు, ఏజెన్సీ ప్రాంతం పోలవరంలలో సి. హెచ్.సి. ల సర్వే జరిగింది.

**హింస:-** డిశంబర్ 16 'నిర్భయ డే' సందర్భంగా హింసపై విజయనగరంలో 120 మందితో, బొబ్బిలిలో 130 మందితో సదస్సులు జరిగాయి. రాజోలులోని మామిడికుదురు మండలంలో



పశ్చిమగోదావరి


అనంతపురం

ఒక వ్యక్తి మహిళలను మోసం చేసి అత్యాచారం చేసి ఆపై హత్య చేసిన సంఘటనలపై మానవహారం, ధర్నా జరిగింది. నర్సాపురంలో గౌతమి హత్య కేసులో కుటుంబానికి న్యాయం చేయాలని, సక్రమంగా విచారణ జరిపాలని ర్యాలీ జరిపి అనంతరం గౌతమి కుటుంబాన్ని పరామర్శించి ఐద్వా అండగా వుంటుందని ధైర్యం చెప్పారు. నెల్లూరు జిల్లాలో మహిళలపై హింసకు వ్యతిరేకంగా డి.కె.డబ్ల్యూ కళాశాలలో సదస్సు జరిగింది. అనంతపురం జిల్లాలో జరిగిన జాహ్నవి రెడ్డి, శ్వేత, ఆత్మహత్యల ఘటనపై 4 మహిళా సంఘాలతో రౌండ్‌టేబుల్ సమావేశము 22 మందితో జరిగింది. జిల్లా ఎస్‌పికి మెమోరాండమ్ ఇచ్చారు.

**డ క్రా:-** ఎస్‌కోటలో డ్వాక్రా సభ్యులలో 38 గ్రూపులకు మొదటి విడత, రెండవ విడత డబ్బులు ఇవ్వాలని, ఆన్‌లైన్ చేయాలని కలెక్టరేట్ వద్ద 70 మందితో ధర్నా జరిగింది. తూ.గోదావరి జిల్లాలో 325 మందితో డ్వాక్రా సమస్యలపై సదస్సు జరిగింది. సదస్సు అనంతరం ఎస్.బి.ఐ. వరకు ప్రదర్శన జరిగింది. ఈ సదస్సుకు ఆంధ్రాబ్యాంకు ఫీల్డ్ ఆఫీసరు, డ్వాక్రా కో ఆర్డినేటర్ హాజరు అయ్యారు.

**సావిత్రిబాయి పూలే జయంతి:-** జనవరి 3న విజయనగరం జిల్లాలో 100మందితో సదస్సు జరిగింది. తూ.గో జిల్లాలో 32


విశాఖ

సెంటర్లలో సదస్సులు నిర్వహించి స్కూల్ టీచర్స్‌ను, ఎం.పి.డి.ఓ లను ముఖ్య అతిధులుగా ఆహ్వానించారు. ప.గో జిల్లాలో 200మందితో సదస్సు జరిగింది. పశ్చిమ కృష్ణలో 5 సెంటర్లలో 600మందితో గుంటూరులో రెండు సెంటర్లలలో 500మందితో, కర్నూలులో 3 చోట్ల సదస్సులు జరిగాయి. విశాఖజిల్లా నర్సీపట్నం-3 , పరవాడ, వాడచీపురుపల్లి స్కూల్‌లో 500మంది విద్యార్థులతో, అనంతపురంలో రెండు సెంటర్లలో సెమినార్ నిర్వహించారు. 1100 మంది విద్యార్ధినులు పాల్గొన్నారు.

**వర్ధంతి సభలు:-** విజయనగరంలో సుశీలా గోపాలన్ వర్ధంతి సభ సందర్భంగా 30 మందితో జరిగింది. విశాఖ జిల్లాలో అంబేద్కర్

వర్ధంతి సందర్భంగా నాలుగు సెంటర్లలో 160 మందితో సభలు జరిగాయి, డి. శారదగారి వర్ధంతి సందర్భంగా నర్సీపట్నంలో 20 మందితో సభ జరిగింది.

**వేముల రోహిత్ వర్ధంతి:-** హైదరాబాద్ సెంట్రల్



విజయవాడ

యూనివర్శిటీ రీసెర్చ్ స్కాలర్ వేముల రోహిత్ మొదటి వర్ధంతిసందర్భంగా విజయవాడ తుమ్మలపల్లి కళాక్షేత్రం నుండి లెనిన్ సెంటర్ నుండి 150 మందితో ర్యాలీ, సభ జరిగాయి. జంగారెడ్డి గూడెంలో సదస్సు, గుంటూరు జిల్లాలో అన్ని ప్రజాసంఘాలతో రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించి, కలెక్టర్ ఆఫీసు వద్ద ధర్నా చేశారు. ప్రకాశం జిల్లాలో ఎస్.ఎఫ్.ఐ, డి.వై.ఎఫ్.ఐ, ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో ప్రదర్శన జరిగింది. అనంతపురంలో ఐద్వా, కె.వి.పి.ఎస్, ఎస్.ఎఫ్.ఐ, డి.వై.ఎఫ్.ఐ., గిరిజన సంఘాల ఆధ్వర్యంలో 70 మందితో ర్యాలీ నిర్వహించారు. నెల్లూరులో కొవ్వొత్తుల ప్రదర్శన అనంతరం సభ జరిగింది.

**సంక్రాంతి ఆటలపోటీలు:-** శ్రీకాకుళం-2 సెంటర్స్,



విజయవాడ

విజయనగరం-13, తూ.గోదావరి-20, ప.గోదావరి -97, తూర్పు కృష్ణా జిల్లా- 29, పశ్చిమ కృష్ణా-100, గుంటూరు-6, కర్నూలు-20, అనంత పురం-10, నెల్లూరు-100 సెంటర్స్‌లో ఆటల పోటీలు జరిగాయి. ఉట్టి కొట్టడం, ముగ్గులు, మ్యూజికల్ చైర్స్, లెమన్ అండ్ స్పూన్, తాడు లాగు ఆటు, కబడ్డీ, వ్యాసరచన, డ్రాయింగ్, డాన్స్, క్రికెట్ వంటి క్రీడలు నిర్వహించగా 39,000మంది పాల్గొన్నారు.



**స్థానిక సమస్యలు:-** శ్రీకాకుళం జిల్లా పెదపాడులో అగ్ని ప్రమాదం జరగగా వారికి ఐద్వాగా సహాయం చేశారు. అమలాపురంలో హాస్టల్‌ను మధ్యంతరంగా మర్చడాన్ని నిరశిస్తూ విద్యార్థులు, యాజమాన్యం చేస్తున్న నిరసన కార్యక్రమానికి ఐద్వా మద్దతు ఇవ్వటమైనది. గుంటూరు జిల్లా జన్మభూమి కార్యక్రమంలో డివిజన్స వారీగా డ్రైనేజీ, వీధి దీపాలు, ఇళ్ళపట్టాలు, రోడ్లు, రేషన్ కార్డులు, పెన్షన్స్‌పై మెమోరాండాం ఇవ్వడం జరిగింది. ప్రకాశం జిల్లాలో సెల్‌టవర్ నిర్మాణాన్ని ఆపివేయాలని ఐద్వా, డి.వై.ఎఫ్.ఐ ఆధ్వర్యంలో ధర్నా చేశారు. టవర్ నిర్మాణాన్ని ఆపివేశారు. నెల్లూరు జిల్లాలో డ్రైనేజీ, వీధి దీపాలు, పారిశుద్ధ్యం, దోమల నివారణ, మొదలగువాటిపై మున్సిపల్ ఆఫీసు ముందు 150 మంది ధర్నా చేశారు. కర్నూలు జిల్లాగనీ,శకునాలలో సోలార్ పరిశ్రమలలో భూములు కోల్పోయిన రైతులకు హైకోర్టు అనుకూలంగా తీర్పు ఇచ్చింది. ఆ గ్రామాలలోని మహిళలతో సహా ప్రజలు రెండుసార్లు వారం రోజులుపైగా జైలులో ఉన్నారు. ప్రజల పోరాట ఫలితమే ఈ తీర్పు.

**మద్యం:-** తాడేపల్లి గూడెంలో బెల్టుషాపులు తొలగించాలని ధర్నా చేశారు. ధర్నా అనంతరం మద్యం సీసాలు పగులగొట్టి షాపు మూయించేశారు. ఎక్సైజ్ అధికారులు వచ్చారు. సంతకాల సేరణతో ఆఫీసుముందు 30 మందితో ధర్నా చేశారు. నెల్లూరు జిల్లాలో బెల్ట్ షాపుల వద్ద 100 మంది మహిళలతో ధర్నా చేశారు. అనంతపురంలో నూతన సంవత్సరము సందర్భంగా డిశంబర్ 31వ తేదీ బ్రాందీ షాపులను మూసివేయాలని (రాత్రి 9గం॥లకే)

డిమాండ్ చేస్తూ ఐద్వా, డి.వై.ఎఫ్.ఐ సంఘాలు కలిసి గాంధీ విగ్రహం దగ్గర బ్రాందీ షాపులు మూసివేయాలని ధర్నా జరిగింది. అనంతరం కలెక్టర్, ఎస్.పి. గార్లకు వినతిపత్రం ఇచ్చాము.

**స్కీం వర్కర్ల సమ్మె:-** జనవరి 20వ తేది స్కీం వర్కర్ల సమ్మెలో అన్ని మండలాల్లో ఐద్వా కార్యకర్తలు పాల్గొని సంఘీభావం తెలిపారు.




**మరుగుదొడ్ల సమస్య:-** విజయనగరంలో స్వచ్ఛభారత్ సందర్భంగా మరుగు దొడ్లు నిర్మించాలని మునిసిపల్ ఆఫీసు వద్ద వంద మందితో ధర్నా చేశారు.

**మహిళా వ్యతిరేక బిజెపి ప్రభుత్వం:**

"మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలు-పరిష్కారాలు" అనే అంశంపై ఐద్వా రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన సదస్సులో ఐద్వా జాతీయ కార్యదర్శి మరియం ధావలే మాట్లాడుతూ 'దేశంలో మహిళలపై హింస పెరుగుతోందని, వీరిని ద్వితీయ స్థాయి పౌరులుగా భావించడమే ఇందుకు కారణమని, బిజెపి ప్రభుత్వం మహిళా వ్యతిరేక ప్రభుత్వమని' అన్నారు. మహిళలపై లైంగిక దాడులు పెరిగాయి. మూడుసార్లు తలాక్ చెప్పే పద్ధతిలో షరియత్ నియమాలకు అనుకూలంగా జరగడం లేదన్నారు. కేవలం ఎస్ఎమ్ఎస్‌లు, ఫోన్‌కాల్స్ ద్వారా చెప్పడం దారుణమని చెప్పారు. ఈ అంశంపై ఐద్వా ఆధ్వర్యంలో సంతకాల సేకరణ చేపట్టినట్లు తెలిపారు. ఆర్ఎస్ఎస్, విహెచ్‌పి సంస్థలు సమావేశాలు నిర్వహించి మహిళలు ఎలా ఉండాలనే అంశంపై వారిని తప్పుదోవ పట్టిస్తున్నారని తెలిపారు. నోట్లరద్దు మూలంగా ఏ సమస్యా పరిష్కారం కాకపోగా, సామాన్య ప్రజలు ముఖ్యంగా మహిళలు ఎన్నో ఇబ్బందులకు గురయ్యారు.

నోట్ల రద్దు విఫలమవడంతో ఇప్పుడు నగదు రహిత లావాదేవీలను తెరపైకి తెచ్చారన్నారు. ఆన్‌లైన్‌లో రేషన్ తీసుకోవడం మన దేశంలో ఎంత వరకూ సాధ్యమని ప్రశ్నించారు. గ్రామీణ ప్రాంతాల్లో కేవలం 13 శాతం ఇంటర్నెట్ సౌకర్యం ఉందని, 26శాతం ప్రజలకి మాత్రమే స్మార్ట్ ఫోన్‌లున్నాయని తెలిపారు. నగదు రహిత లావాదేవీలవల్ల సర్వీసు టాక్స్ రూపంలో 1నుంచి 3 శాతాన్ని అదనంగా చెల్లించాల్సి వస్తుందన్నారు. దేశంలో 1శాతం సంపన్నుల చేతిలో రూ. 260 లక్షల కోట్లు సంపద ఉండగా, 99శాతం ప్రజలు చేతిలో 97లక్షల కోట్లు మాత్రమే ఉందన్నారు. 46,658 మెట్రిక్ టన్నుల ఆహార పదార్థాలు గోడౌన్స్‌లో నిల్వ ఉంటే మరోవైపు దేశంలో తిండి దొరకని వారు లక్షల మంది ఆకలితో అలమటిస్తున్నారని ఆరోపించారు. బి. ప్రభావతి అధ్యక్షతన జరిగిన ఈ సభలో కార్యదర్శి డి. రమాదేవి, ఉపాధ్యక్షురాలు కె. స్వరూపరాణి, జిల్లా కార్యదర్శి శ్రీదేవి తదితరులు పాల్గొన్నారు.




ఐద్వా క్యాలెండర్ విడుదల చేస్తున్న విశాఖ సిటీ కమిటీ




ప్రత్యేక హోదాపై ప్రజా సంఘాల ర్యాలీ-విశాఖ







పాటలు పాడుతున్న ఏపి ప్రతినిధులు

మహాసభల పోస్టర్ విడుదల-విశాఖ











ఎన్నికైన కేంద్ర కమిటీ సభ్యులు జ్యోతి, హైమావతి, ఆశాలత, సమీనా అఫ్రోజ్, రత్నమాల - తెలంగాణా

CHAITANYA MANAVI R.NO. APTEL/2006-20000
VOL : 12 ISSUE : 2 HYDERABAD, FEBRUARY 2017 52 PAGES 10 Rs.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMVOLA155 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది. | Nandini |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |